# మల్లెపూదండ

## తెలుగు కవిత కథ

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాదు - 500 027

**MALLEPOO DANDA**

The Story of Telugu Poetry for Children
By BOMMAKANTI SRINIVASACHARYULU

*Editor & Publisher*
**B. SUBBARAYAN**
Secretary,
Andhra Pradesh Baalala Akademi, Hyderabad–27

ప్రచురణ : 74; © 1987

ప్రొడక్షన్ ఎడిటర్
**చొక్కాపు వెంకటరమణ**

ఎడిటోరియల్ అసిస్టెంట్
జె కామేశ్వరరావు

చిత్రకారుడు
**గోలి శివరామ్**

సాదా ప్రతి : రూ. 8/-
**మేలు ప్రతి : రూ. 12/-**

ప్రతులకు
**ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి**
బర్కత్‌పురా, హైదరాబాదు-500 027
ఫోన్ : 67683

ముద్రణ
**శ్రీలక్ష్మి వేంకటేశ్వర పవర్ ప్రెస్,**
**హిమాయత్‌నగర్, హైదరాబాదు.**

'MMENDED FOR THE AGE GROUP : 12+ YEARS

# మనవి

మన భావాలను ఎదుటి వారికి వ్యక్తం చేసేది భాష. ఆ భాషతో రకరకాల ప్రయోగాలు చేసి జనరంజకమైన సాహిత్యం సృష్టించిన కవులు ఎందరో ఉన్నారు. తెలుగు సాహిత్యానికి వన్నె తెచ్చి, సాహితీ చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయిన ప్రాచీన కవులతో పాటు ప్రజా సాహిత్యాన్ని రచించిన ఆధునిక కవుల వరకు అందరిని గురించి తెలుగు బాలలకు పరిచయం చేసి, వారికి మన సంస్కృతి సాహిత్యాల పట్ల సమగ్ర అవగాహన ఏర్పడేందుకు తోడ్పడాలనే ఉద్దేశంతో తెలుగు కవిత కథ ఈ "మల్లెపూదండ"ను బాలల అకాడమి ఒక ప్రతిష్ఠాకరమైన ప్రచురణగా మీకు అందిస్తోంది.

బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించటానికి అకాడమి పిల్లల పుస్తకాల ప్రచురణను చేపట్టి ఎనిమిదేళ్ళలోపు వయసు పిల్లలు, పదకొండేళ్ళ లోపువారు, పన్నెండేళ్ళు పైబడినవారు- అని ఇలా మూడు వయోవర్గాల పిల్లల కోసం వివిధ భాషా స్థాయిలలో రంగుల బొమ్మల పుస్తకాలను ప్రచురిస్తోంది. ఈ 'మల్లెపూదండ' పన్నెండేళ్ళు పైబడిన స్థాయి పిల్లలకోసం ఉద్దేశించి రాసింది.

సాచీరకాల మిత్రుడు, కవి, పండితుడు, విమర్శకుడు శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు ఈ పనికి సర్వ విధాలా తగినవాడు అని నాకు అనిపించింది. అందుకే ఈ పుస్తకం రాసిపెట్టమని ఆయనను నేను అడిగాను. మొదట కొంచెం సందేహించినా చివరికి నాకు సంతృప్తికరంగా ఈ పుస్తకం ఆయన రాసి ఇచ్చారు బాలల అకాడమి తరపున ఆయనకు నా కృతజ్ఞతాభివందనాలు !

'మల్లె పూదండ'కు అందమైన రేఖా చిత్రాలను, ముఖచిత్రాన్ని వేసి అందించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ గోలి శివరామ్‌కు మా ధన్యవాదాలు.

హైదరాబాదు-27
1-5-1987

బుడ్డిగ సుబ్బరాయన్
కార్యదర్శి,
ఆం. ప్ర. బాలల అకాడమి

# రెండు మాటలు

ఈ 'తెలుగు కవిత్వ కథ'ని మనుమరాళ్ళకు వినిపించిన ఆ తాతయ్య దయానిధిని నేనే !

వేసవి సెలవుల కని మా ఊరు వచ్చిన మా మనుమరాళ్ళ కబుర్లూ, ధోరణీ చూసి నేను నిర్ఘాంతపోయాను. ఎంత సేపటికీ క్రికెట్ ఆటగాళ్ళూ, సినిమా స్టార్లూ, టీవీ సీరియల్‌లూ, ఇంద్రజాలం లాంటి తేలిక విషయాలు తప్ప మరో మంచి విషయం మీదికి వాళ్ళ ప్రసంగం మళ్ళడం లేదు. ఈ తరం పిల్లలు ఎంతగా మారిపోతున్నారా అని నేను ఆశ్చర్యపోయాను.

మన ఆదికవి నన్నయ "స్వస్థాన, వేష, భాషాభిమానాలు గల రస ప్రలుబ్ధ ధీకులే లోకంలో నిజంగా గౌరవం పొందుతారు" అంటాడు. కాని, ఈ నాటి మన పిల్లల్లో తమ దేశంమీద గాని, తమ వేషంమీద గాని, తమ భాషమీద గాని ఉండవలసినంత గౌరవం ఉందా ? మీరే ఆలోచించండి.

ఎలాగైనా ఈ సెలవుల్లో తెలుగుభాష అంటేనూ, మహనీయులైన ప్రాచీన తెలుగు కవులంటేనూ నేను మా మనుమరాళ్ళకు కాస్త గౌరవం, ఆసక్తి కలిగించ గలిగితే ఎంత బావుండును అనుకున్నాను. అయితే మనం వాళ్ళ నెత్తిన బలవంతాన రుద్దుతున్నట్టు అనిపిస్తే వాళ్ళచేత ఒక్క

అక్షరం వినిపించలేం. అందుచేత సరదాగా వాళ్ళను తోటల వెంటా, దొడ్ల వెంటా తిప్పి, ఆ మాటలూ, ఈ మాటలూ చెప్పి, ''తాతయ్యా! ఈ సెలవుల్లో మన తెలుగు కవిత్వం ఎన్నెన్ని మార్పులు చెందుతూ వచ్చిందో, ఎన్నెన్ని మలుపులు తిరిగిందో ఒక కథలాగ సరదాగా మాకు చెప్పవూ?'' అని వాళ్ళే నన్ను అడిగేట్టు చేసుకున్నాను. ఆరు సాయంత్రాలు వరుసగా మన తెలుగు కవిత్వ చరిత్రలోని ఆరు యుగాల కథలను వారికి చెప్పాను.

ప్రతి యుగంలోనూ పుట్టిన కవులందరి పేర్లూ, వాళ్ళు వ్రాసిన కావ్యాల పేర్లూ ఏకరువు పెట్టడం మొదలుపెడితే వాళ్ళకు బోరు కొడుతుంది. వాళ్ళచేత కథ ఆసాంతం వినిపించడం సాధ్యం కాదు. అందుకని ప్రతి యుగంలోనూ వచ్చిన ప్రముఖ కవులను గురించీ, వాళ్ళ కవితా రీతులను గురించీ మాత్రమే చూచాయగా వివరిస్తూ, ఆ యా కావ్యాలు చదవాలనే ఆసక్తి, ఉత్కంఠ వాళ్ళలో రేకెత్తించేందుకు మాత్రమే నేను ప్రయత్నించాను.

మా మనుమరాళ్ళిద్దరి వెంటా వచ్చిన వాళ్ళ స్నేహితురాలు అమల మంచి చురుకైన పిల్ల; బుద్ధిమంతురాలు. కొత్త విషయాలు తెలుసుకోవాలనే ఆస్థ గలది. నా కథ రక్తి కట్టించడానికి ఆమె చాలా దోహదం చేసింది. రోజూ నేను చెప్పిన కథ శ్రద్ధగా వినడమే కాకుండా, ఇంటికి వెళ్ళగానే ఎంత పొద్దు పోయినా లైటు వేసుకుని కూచుని, ఆ రోజున చెప్పిన కథంతా ఒక నోట్ బుక్‌లో వ్రాస్తూ వచ్చింది.

ఈ మధ్య ఏదో పనిమీద మా ఇంటికి వచ్చిన మా మిత్రుడు బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు అమల వ్రాసిపెట్టిన ఈ 'తెలుగు కవిత కథ' చదివాడు. ''మన ప్రాచీన తెలుగు కవులంటే గౌరవం, తెలుగు కవిత్వం అంటే ఇష్టం కలుగవలసింది నీ మనుమరాళ్ళకు మాత్రమేనా!

దేశంలో ఉన్న ఆ వయస్సు బాల బాలిక లందరూ నీకు మనుమలూ, మనుమరాళ్ళ వంటి వారు కారా? అందరికీ ఇది ఉపయోగపడాలి. అందుచేత అచ్చువేయిస్తాను, నా కియ్యి!'' అని ఆ నోట్ బుక్ తీసుకు పోయాడు.

ఆయనకు మిత్రుడు, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ కార్యదర్శి శ్రీ బుద్దిగ సుబ్బరాయన్ పుణ్యమా అని ఏదో ఆషామాషీగా నేను చెప్పిన ఈ 'తెలుగు కవిత కథ' అచ్చయి, ఇప్పుడు ఈ రూపంలో మీ అందరి ముందుకూ వస్తూంది. ఆ మహనీయుడు శ్రీ సుబ్బరాయన్‌కు నా ధన్యవాదాలు!

ప్రక్కన కూచుని ఈ రెండు మాటలూ నాచేత వ్రాయిస్తున్న శ్రీనివాసాచార్యులు ఇంకో మాట కూడా వ్రాయమని నన్ను గోకుతున్నాడు: ఈ పుస్తకం ఇంకా ఉపయోగకరంగా ఉండేందుకు అవసరమైన చేర్పులూ, మార్పులూ సహృదయులు సూచిస్తే, మలి ముద్రణలో కృతజ్ఞతతో వాటిని చేరుస్తాము—అని!

నమస్తే!

ఆగిరిపల్లి,
1-5-1987.

ఇట్లు
'దయానిధి'

# ఇందులో....



# అనగా అనగా

*"మా తెలుగు తల్లికీ*
*మల్లె పూ దండా!*
*మము గన్న తల్లికీ*
*మంగళారతులూ!"*

ట్రాన్సిస్టర్ రేడియోలో టంగుటూరి సూర్యకుమారి గొంతు మధురంగా వినిపిస్తూంది.

"నాగరకత పెరిగి ప్రపంచం అంతా ఒకే కుటుంబం కాబోతున్న ఈ రోజుల్లో కూడా ఇంకా ఏమిటో ఈ ప్రాంతీయాభిమానాలు! 'తెలుగు తల్లి', 'తమిళ తల్లి' 'కన్నడ తల్లి', 'మలయాళ తల్లి' అంటూ ఇందరు తల్లులు ఉన్నారా? ఉన్నది ఒక్కతే భారత మాత! మళ్ళీ మాట్లాడితే నిజంగా ఉన్నది ఒక్కతే జగజ్జనని! అందరం ఆ తల్లి బిడ్డలమే!" అంటూ ఉపన్యాసం అందుకుంది కమల.

"ఆపవే తల్లీ! ముందు ఆ పాట విననీ! ఆపు నీ సోది! ఆ పాట వింటూంటే తెలుగు రక్తం ఒంట్లో ప్రవహించే ఏ వ్యక్తికైనా ఒళ్లు పులకరించి పోదూ?" అని ఆమె ధోరణికి అడ్డం తగిలింది విమల.

"అబ్బబ్బ! మళ్ళీ మొదలు పెట్టారూ మీ వాదం? తాతయ్యా నడిగి మంచి మంచి సంగతులు ఏవైనా తెలుసుకుందా మని నేను తోటకు తీసుకు వస్తే ఇక్కడా మీ గోలేనా?" అని విసుక్కుంది అమల.

మనుమరాళ్ళ మాటలకు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ తాత దయానిధి గొంతు సవరించుకుని ఇలా అన్నాడు: "కమల అన్నట్టు విశ్వ సౌభ్రాత్రమూ మనకు అవసరమే! విమల అన్నట్లు తెలుగు అభిమానమూ మనకు అవసరమే! ఇవి రెండూ పరస్పరం విరుద్ధమైనవి కావు. నిజానికి తన భాషనీ, తన సంస్కృతినీ ప్రేమించలేని వాడు ప్రపంచాన్ని ఎలా ప్రేమించగలడు? ఆలోచించండి!" తాతయ్య మాట్లాడడం మొదలు పెట్టగానే ట్రాన్సిస్టర్ ఆఫ్ చేసింది కమల.

ఆ క్రితం రోజే కవల పిల్లలైన కమల, విమల వాళ్ళ క్లాస్‌మేట్ అమలతో సహా సెలవులకు హైదరాబాద్ నుంచి తమ తాతగారి ఊరు ఆగిరిపల్లి వచ్చారు. వ్యవసాయపు పనులు చూసుకుంటూ ప్రస్తుతం ఆగిరిపల్లిలో స్థిరపడ్డాడు దయానిధి. ఆయన బాగా చదువుకున్నవాడు. వాళ్ళ ఇంట్లో లైబ్రరీ చూసి మనుమరాళ్ళకు కళ్లు తిరిగిపోయాయి. పల్లెటూరైనా రేడియో, టెలివిజన్ లాంటి ఆధునిక హంగు లన్నీ అమరి ఉన్నాయి వాళ్ళ ఇంట్లో. ఏ విషయాన్నైనా అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్టు చెప్పగల డని తాతయ్య మీద ఆ రెండు రోజుల్లోనే మనుమరాళ్ళకు మంచి గురి కుదిరింది. "ఈ సెలవులలో ఎన్నో

విషయాలు తాతయ్య నడిగి మనం తెలుసుకోవాలి!" అంది అమల తన స్నేహితురాళ్ళతో. అమలే తాతయ్యను ప్రోత్సాహం చేసి ఆ రోజు మామిడి తోటకు బండీ కట్టించింది.

తోటలో ఒక మామిడి చెట్టు క్రింద శుభ్రం చేసి పనివాడు కోటయ్య జంపకానా పరిచాడు. చల్లగా గాలి వీస్తూంది. ఇంటి నుంచి తెచ్చుకున్న పులిహోర కారియరూ, మరచెంబెడు మంచి నీళ్ళూ, కాఫీ ఫ్లాస్కులూ ఖాళీ చేశారు.

దీర్ఘాలోచనలో పడ్డ తాతయ్య ఏమి చెబుతాడో అని ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు మనుమరాళ్లు.

"మన తెలుగు భాష, మన తెలుగు జాతి ఎంత ప్రాచీనమైనవో మీకు తెలుసా?" అడిగాడు తాతయ్య.

"స్కూల్లో సైన్స్ లాంటి ఇతర సబ్జెక్టుల మీద ఉన్నంత శ్రద్ధ మాకు తెలుగు మీద ఉండదు తాతయ్యా!" అని ఒప్పుకుంది విమల.

"ఈ సెలవులలో మన తెలుగు జాతి కథ, తెలుగు కవుల కథ మాకు చెప్పు తాతయ్యా సరదాగా!" అని అడిగింది ఆసక్తిగా అమల. "అల్లాగే నమ్మా!" అంటూ తాతయ్య మొదలు పెట్టాడు :

"ఇండియాలో హిందీ మాట్లాడే వారి సంఖ్య తరువాత తెలుగు మాట్లాడే వారి సంఖ్యే ఎక్కువ. మన ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగు మాట్లాడే వారు ఇవాళ సుమారు అయిదు

కోట్ల మంది ఉన్నారు. ఇక తమిళనాడు వంటి ఇండియాలోని ఇతర రాష్ట్రాలలోనే కాక, మలేషియా, శ్రీలంక, మారిషస్, ఫిజీ దీవులు వంటి విదేశాలలో కూడా ఉన్న తెలుగువారి సంఖ్య దాదాపు ఒక కోటి దాకా ఉంది.''

''తెలుగు మాట్లాడేవారు ఎప్పటినుంచి ఈ దేశంలో ఉన్నారు తాతయ్యా! మన చరిత్ర ఎంత ప్రాచీనమైంది?'' అని అడిగింది అమల.

''సుమారు రెండు వేల సంవత్సరాల నుంచే మన చరిత్ర కొంత కొంతగా మనకు తెలుస్తూంది. అంతకు ముందు కూడా మన జాతీ, మన భాష ఏదో రూపంలో ఉండే ఉండాలి. ఐతరేయ బ్రాహ్మణంలో మనం విశ్వామిత్రుని సంతతి వాళ్ళం అని ఉంది. ఆయన తన మాట వినని యాభై మంది కొడుకులనూ ''మీరు ఆటవికులతో కలసి జీవింతురు గాక!'' అని శపించాడట. ఆ యాభై మంది సంతతిలోనూ పుండ్రులూ, శబరులూ మొదలైన వాళ్ళతో పాటు ఆంధ్రులూ ఉన్నారు.

''రామాయణంలోనూ, భారతంలోనూ కూడా ఆంధ్రుల ప్రస్తావన ఉంది. అయితే ఆ నాడు ఆంధ్రభాష ఎలా ఉండేదో ఆ నాటి ఆంధ్రుల చరిత్ర ఎలా సాగిందో మనకు ఇప్పుడు స్పష్టంగా తెలియదు.

''ఆంధ్ర విష్ణువు అనే ఆంధ్ర రాజు నిశుంభు డనే నాగ రాజును వధించి కృష్ణాతీర ప్రాంతానికి ప్రభు వైనట్టు ఒక పురాణ కథ ఉంది. ఒక ఆర్యశాఖ దక్షిణాపథానికి వచ్చి

అప్పుడు ఇక్కడ జీవిస్తున్న నాగులు, యక్షులు మొదలైన వారిని జయించి వారితో కలసిపోవడం వల్ల ఈ నాటి మన తెలుగుజాతి ఏర్పడిం దని చెప్పుకోవచ్చు.

"క్రీస్తుశకం ప్రారంభం నుంచీ మన చరిత్ర కొంత వరకు స్పష్టంగా తెలుస్తూంది. శాతవాహనులు, ఇక్ష్వాకులు, బృహత్ పలాయనులు, పల్లవులు, శాలంకాయనులు, కాదంబులు, విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు, కాకతీయులు, రెడ్డి రాజులు, తుళువ, సాళువరాజులు, గోల్కొండ నవాబులు, అసఫ్‌జాహి నవాబులు, ఆంగ్లేయులు వరుసగా మన దేశాన్ని పాలించిన కథ లన్నీ మన దేశ చరిత్ర మనకు చెబుతూంది."

"తాతయ్యా! ఆంధ్ర జాతివారు మాట్లాడే భాష గనుక మన భాష ఆంధ్ర భాష అయింది సరే! మరి మన భాషకు 'తెలుగు', 'తెనుగు' అనే పేర్లు ఎలా వచ్చాయి?" కమల ప్రశ్నించింది.

"తెలుగు అనేది 'త్రిలింగ' అనే సంస్కృత శబ్దం నుంచి వచ్చిం దంటున్నా రమ్మా! శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామం అనే మూడు చోట్ల గల శివ లింగాల మధ్య ఉన్న దేశం గనుక ఇది త్రిలింగ దేశం అయిందట. గ్రీక్ భూగోళ శాస్త్రవేత్త 'టిలింగాన్' అన్నాడు. బర్మాలో 'తైలింగ్'లనబడే వారున్నారు. ఆ 'టిలింగాన్', 'తైలింగ్' శబ్దాలు 'తెలుగు' శబ్దపు పూర్వ రూపాలు కావచ్చు!

"తెనుగు అనే పదం త్రినగ (మూడు కొండల మధ్య గల దేశం) శబ్దం నుంచి వచ్చిందని కొందరూ,'తెన్+అగు'-

దక్షిణాన ఉన్నవారు అనే అర్థంలో- 'తెనుగు' అయిం దని కొందరూ అంటున్నారు. ములగకాయ - మునగకాయగా మారినట్టు 'తెలుగు' 'తెనుగు' అయి ఉండ వచ్చునని మరి కొందరి ఊహ. ఏదీ నిర్ధారణగా తెలియదు. తెలుగులో ఆది కవి నన్నయ మాత్రం 'తెనుగు' అనే పదమే వాడారు.

అమలకు సందేహం వచ్చింది: "మన ఆది కవి నన్నయ్య అంటున్నారు గదా! అంతకు ముందు తెలుగు భాష లేదా తాతయ్యా?"

దయానిధికి నవ్వు వచ్చింది. "ఒక మనిషితో భాష పుడుతుందా పిచ్చితల్లీ? ఎప్పటి నుంచి ఈ గడ్డమీద తెలుగు భాష మాట్లాడుతూ ఉండేవారో మనకు స్పష్టంగా తెలియదు. రామాయణ, భారతాల కాలం నించీ కూడా ఏదో ఒక రూపంలో ఈ భాష ఉండే ఉండాలి. అయితే ఈ భాష ఉని కికి నిదర్శనాలు మాత్రం సాతవాహనుల కాలం (క్రీ.పూ. 225 - క్రీ.శ. 225) నుంచే మనకు కనిపిస్తున్నాయి.

"సాతవాహన రాజు హాలుడు సంకలనం చేసిన 'గాథా సప్త శతి' (700 గాథలు) లో 'అత్త', 'పాడి' లాంటి తెలుగు పదా లెన్నో ఉన్నాయి. ఆ గాథలలో తెలుగు జీవన దృశ్యాలు కనిపిస్తున్నాయి. హాలుని మంత్రి గుణాఢ్యుడు తన బృహత్ కథను 'పైశాచి' భాషలో రాశా డనీ, ఆ 'పైశాచి' నేటి తెలుగు భాషకు పూర్వ రూపం కావచ్చు ననీ అంటున్నారు. అయితే ఆ బృహత్కథ మనకు లభించలేదు.

"తెలుగు రాజులు వేయించిన ప్రాచీన ప్రాకృత దాన శాసనాలలో 'ఏలూరు', 'దెందులూరు', 'పెనుగొండ', 'ఉప్పులూరు' లాంటి తెలుగు ఊళ్ళ పేర్లూ, కొట్టుశర్మ, తూర్కశర్మ లాంటి ఆ నాటి తెలుగు బ్రాహ్మణుల పేర్లూ కనిపిస్తున్నాయి.

"తరువాత క్రమంగా శాసనాలు సంస్కృతంలో వేయించే ఆచారం వచ్చింది. అలాంటి సంస్కృత శాసనాలలోనూ గ్రామాల సరిహద్దులను తెలిపే సందర్భాలలో తెలుగు మాటలు కొన్ని వాడారు."

కుతూహలంగా వింటున్న అమల మళ్ళీ అడిగింది: "నన్నయ్యకు ముందు పూర్తిగా తెలుగులోనే ఉన్న శాసనాలు అసలు దొరకలేదా తాతయ్యా?"

తాతయ్య ఆ ప్రశ్నకు జవాబు చెప్పేలోగా కోటయ్య తంపట వేసి కాల్చిన వేరు సెనగ కాయలు తెచ్చి పెట్టాడు. అవి ముగ్గురు మనుమరాళ్ళకూ పంచుతూ తాతయ్య అన్నాడు: "పూర్తిగా తెలుగులోనే ఉన్న శాసనాలు రేనాటి చోళుల కాలం (క్రీ.శ. 575 - 600) నుంచే మనకు లభించాయి. అయితే ఆ రోజులలో జీవించి ఉన్న మన ముత్తాతలు ఎవరైనా ఏదైనా మంత్ర ప్రభావంతో ఈనాడు మళ్ళీ జీవించి వస్తే వాళ్ళ భాష మనకూ మన భాష వాళ్ళకూ ఎంత మాత్రం అర్థం కాదు. అంత పాత తెలుగు ఆ శాసనాలలోది! భాష నిరంతరంగా మారుతూ వస్తుంది. వాడుక భాష మరీనీ! ఆ నాటి తెలుగు భాష మీద సంస్కృత భాష ప్రభావం చాలా తక్కువగా ఉండేది.

తన సోదరీ భాషలైన తమిళ, కన్నడాలకు ఆ నాటి తెలుగు మరింత దగ్గరగా ఉన్నట్టు కనిపిస్తుంది.''

ఈ సారి కమలకు సందేహం వచ్చింది: ''తాతయ్యా! నన్నయ్యకు ముందు ఏదో ఒక రూపంలో మన తెలుగు భాష ఉంది సరే! మరి తెలుగు కవిత్వం కూడా ఉందా? లేక తెలుగులో కవిత్వం నన్నయ్యతోనే పుట్టుకు వచ్చిందా?''

పిల్లలకు అర్థం అయేట్టు ఆ సంగతి ఎలా వివరించాలా అని క్షణం సేపు ఆలోచించి, దయానిధి ఇలా అన్నాడు: ''ఇంచుమించు భాష ఆరంభం అయిన నాటి నుంచే భాషలో కవిత్వమూ పుడుతుంది తల్లీ! పనిపాటులు చేసుకునే ప్రజలు తమ కష్టాన్ని మరచిపోడానికో, పదిమందీ చేరి సరదా చేసుకునేటప్పుడు పక్కవారిని ఉల్లాస పరచడానికో, తను చూసి వచ్చిన ఏదో అద్భుతాన్ని తోటివారికి వర్ణించి చెప్పడానికో ఎవడో ఒకడు పాట అందుకుంటాడు. చాలా రోజుల దాకా అలాంటి పాట లన్నీ ప్రజల నోళ్ళలోనే ఉండిపోతాయి. భాషకు లిపి ఏర్పడిన తర్వాత గాని లిఖిత సాహిత్యం ఏర్పడదు.

''అలా మన ప్రజల నోళ్ళలో తర తరాలుగా నానుతూ వచ్చిన కొన్ని పదాలను పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు: తుమ్మెద పదాలు, ప్రభాత పదాలు, పర్వత పదాలు, ఆనంద పదాలు, నివాళి పదాలు, గొబ్బి పదాలు, వెన్నెల పదాలు లాంటివి. ఇప్పటికీ మన పల్లె ప్రజలు పాడుకునే పదాలలోనూ, ఇటీవలి దాకా మన

స్త్రీలు తీరికవేళల్లో పాడుకొనే పాటలలోనూ బహుశః నన్నయ్యకు ముందునుంచీ తర తరాలుగా ప్రజల నోళ్ళలో మార్పులు చెందుతూ వచ్చిన పాటలు కొన్ని అయినా ఉండి ఉండవచ్చును.''

''తాతయ్యా! నన్నయ్యకు ముందు మన శాసనాలలో పూర్తిగా వచనమేనా? ఇలాంటి పదాలూ, పాటలూ కూడా ఎక్కడైనా కనిపిస్తాయా?'' అని అడిగింది విమల.

''అక్కడొకటీ, అక్కడొకటీ తెలుగు మాటలు ఉన్న సంస్కృత, ప్రాకృత శాసనాలు సుమారు 70 దాకానూ, పూర్తిగా తెలుగులోనే ఉన్న శాసనాలు సుమారు 120 దాకానూ ఇప్పటికి మనకు దొరికాయి. వీటిలో నాలుగు శాసనాలలో మాత్రమే తెలుగు ఛందస్సుతో కూడిన రచనలు కనిపిస్తున్నాయి. అలాంటి వాటిలో మొదటిది తూర్పు చాళుక్య రాజు గుణగ విజయాదిత్యుని సేనాధిపతి పండరంగడు వేయించిన దాన శాసనం (క్రీ.శ. 848). దీనిలో ఒక 'తరువోజ' ఉంది. ద్విపద అనే దేశీయ ఛ్ఛందస్సులో ఒక భేదం తరువోజ. తరువాత కందుకూరు శాసనంలో ఒక సీసపద్యం, యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో కొన్ని మధ్యాక్కరలూ, జినవల్లభుని కుర్క్యాల శిలా శాసనం (940) లో రెండు కంద పద్యాలూ కనిపిస్తున్నాయి. చిత్రం ఏమిటంటే ఇవన్నీ దేశీయ ఛ్ఛందస్సులే! సంస్కృతంలోనుంచి ఎరువు తెచ్చుకున్నవి కావు. నన్నయ కాలంనుంచే శార్దూలం, మత్తేభం లాంటి సంస్కృత ఛ్ఛందస్సులను మనం ఎరువు తెచ్చుకున్నట్టు కనిపిస్తూంది.''

"భారతాన్ని మరి దేశీయ ఛ్ఛందస్సులలోనే నన్నయ్య వ్రాయవచ్చు గదా తాతయ్యా! సంస్కృత ఛ్ఛందస్సులు ఎందుకు వాడారు?"

"సంస్కృత ఛ్ఛందస్సులను నన్నయ్యే తెలుగులోకి తెచ్చాడనడానికి వీలులేదమ్మా! క్రీ.శ. 1000 ప్రాంతం నాటి విరియాల కామసాని శాసనంలో చంపక మాల, ఉత్పల మాల కనిపిస్తున్నాయి.

"ఇక్కడ మీకు ఇంకో సంగతి చెప్పాలి. మనకు దొరికినంతలో మొదటి తెలుగు కావ్యం భారతమే అయినా అంతకు ముందు తెలుగులో కొన్ని కావ్యాలు వెలసి ఏ కారణం చేతో అవి నష్టం అయిపోయి ఉండవచ్చు అని కొందరు అంటున్నారు. లేకపోతే మొట్టమొదటే అంత గొప్ప కావ్యం ఏ భాషలో అయినా రావడం సాధ్యమా అని వారు అడుగుతున్నారు. దానికి తగ్గట్టు - మన పొరుగు భాషలైన తమిళ కన్నడాలలో అంతకు ముందే బౌద్ధులూ, జైనులూ తమ తమ మతాల ప్రచారం కోసం ప్రజల భాషలో కావ్యాలు రాశారు. అలాగే తెలుగులోనూ బౌద్ధులూ, జైనులూ రాసిన కావ్యాలు కొన్ని ఉండవచ్చు ననీ, అవి నష్టమైపోయి ఉండవచ్చు ననీ వారి ఊహ!"

ముసి ముసి చీకటి పడుతూంది. "ఇవాళిటికి ఇంక మన కథ చాలిద్దామా?" అంటూ తాతయ్య కోటయ్యను పిలిచి బండీకట్ట మన్నాడు.

"రేపు మాకు మన కవిత్రయాన్ని గురించీ, వాళ్ళు వ్రాసిన భారతాన్ని గురించీ చెప్పాలి తాతయ్యా! మేము ఇక్కడ ఉండే ఈ నాలుగు రోజుల్లోనూ మన తెలుగు కవుల కథ అంతా నువ్వు మాకు పూర్తిగా చెప్పాలి!" అన్నారు మనుమరాళ్ళు.

"అలాగే తల్లీ!" అన్నాడు దయానిధి.

కోటయ్య తెచ్చిన బండీ ఎక్కి తాము విన్న విషయాలన్నీ నెమరు వేసుకుంటూ పిల్ల లంతా ఇంటికి బయలు దేరారు.



2

# ముగ్గురు మహాకవులు

మర్నాడు మనుమరాళ్ళకోసం అమ్మమ్మ పరమాన్నం, నేతిగారెలూ చేసింది. అవి అన్నీ స్వీష్టకృత్తుగా తిని ఎండ కొంచెం తగ్గగానే వాళ్ళు తాతయ్యను ఆ రోజు పడమటి వేపు మామిడి తోటకు ప్రయాణం కట్టించారు.

క్రితం రోజు లాగే ఓ మామిడి చెట్టు క్రింద కోటయ్య పరచిన జంపఖానా మీద అంతా కూచోగానే కమల అంది చమత్కారంగా :

"తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి అంటూ తెలుగులో ఏదో సామెత ఉందిటగా తాతయ్యా! మాటల సందర్భంలో ఇందాక అమ్మమ్మ అందిలే! ఇవాళ అమ్మమ్మ చేతి గారెలు ఎంత కమ్మగా ఉంటాయో రుచి చూశాం. ఇంక తాతయ్య చెప్పే భారతం ఎంత కమ్మగా ఉంటుందో వినాలి!"

తాతయ్య నవ్వుతూ అన్నాడు: "నేను మీకు భారతం చెప్పబోవడం లేదమ్మా! భారతం వ్రాసిన కవులను గురించి మాత్రమే చెప్పబోతున్నాను. అమ్మమ్మ అన్నట్టు తెలుగు వారికి గారెల కంటె కూడా తెలుగు భారతం ఇష్టం. ఈ

శతాబ్దం ఆరంభం దాకా ఇంటింటా, వాడవాడలా మధ్యాహ్నపు పూట పదిమంది ఒకచోట చేరి భారతం చదువుకోడమో, లేక ఎవరి చేతనైనా పురాణం చెప్పించుకోడమో చేసేవారు.''

''మొదట భారతమే తెలుగు చెయ్యా లన్న ఊహ నన్నయకు అసలు ఎలా వచ్చింది తాతయ్యా?'' అని అడిగింది అమల.

"అదే చెప్పబోతున్నాను. ఇప్పుడు సాహిత్యం మీద రాజకీయాల ప్రభావం కనిపిస్తున్నట్టు ప్రాచీన కాలంలో మతాల ప్రభావం ఎక్కువగా కనిపించేది. చాలా కాలం పాటు ఇండియా అంతటా వైదిక మతమే ప్రచారంలో ఉండేది. సంస్కృతమే సాహిత్య భాషగా ఉండేది. అన్ని ప్రాంతాల విద్వాంసులూ సంస్కృతమే నేర్చుకుని సంస్కృతంలోనే సాహిత్యం, శాస్త్రాలూ వ్రాసేవారు. కేవలం ప్రజల నోళ్ళలో వినిపించే పదాలూ, పాటలూ మాత్రమే దేశభాషలలో ఉండేవి. కాని బౌద్ధమతం, జైనమతం ప్రజలలోకి వ్యాపించా లనే తహతహతో ప్రజల భాషలను సాహిత్య భాషగా స్వీకరించాయి. ఆ ప్రజల భాషలలోనే తమ శాస్త్ర గ్రంథాలనూ, సాహిత్య గ్రంథాలనూ వారు వ్రాయడం మొదలు పెట్టారు. ఆ విధంగా ప్రజలను బాగా ఆకట్టుకుని బౌద్ధమూ, జైనమూ సుమారు వెయ్యేళ్ళపాటు మన దేశంలో ప్రాబల్యం వహించాయి. ఆ రోజులలో వైదిక మతమూ, దానికి సంబంధించిన సంస్కృత సాహిత్యమూ వెనుకబడ్డాయి.

"కాని, బౌద్ధ, జైన మతాలలో అవినీతి ప్రబలడం వల్ల ప్రజలకు క్రమంగా వాటి మీద మోజు తగ్గిపోయింది.

వైదిక మతం, సంస్కృత భాష తిరిగి తల ఎత్తడానికి అవకాశం లభించింది. 8వ శతాబ్దంలో కుమారిలభట్టూ, 9వ శతాబ్దంలో శంకరాచార్యులూ పుట్టి వైదిక మత పునరుజ్జీవనానికి పునాది వేశారు.

"ఆ పరిస్థితులలో తూర్పుచాళుక్య రాజు విమలాదిత్యుడు రాజమహేంద్రవరం రాజధానిగా చేసుకుని తెలుగు దేశాన్ని పాలించసాగాడు. నన్నయ్య చేత భారతం వ్రాయించి తెలుగు వారికి మహోపకారం చేసిన రాజరాజ నరేంద్రుడు ఆయన కుమారుడే!

"ప్రజలలో నీతీ, ధర్మప్రవర్తనా తిరిగి నెలకొల్పడానికీ, వైదిక ధర్మ పునరుద్ధరణకూ తెలుగు భాషలో భారతం వ్రాయించాలని ఆయన సంకల్పించాడు. అందుకు నన్నయను ఆయన ఎంచుకున్నాడు. నన్నయ రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవి, వేదం చక్కగా అధ్యయనం చేసినవాడు. సంస్కృత ఆంధ్ర భాషలలో అనర్గళంగా కవిత్వం చెప్పగలవాడు.

రాజరాజు ప్రేరణతో వైదిక ధర్మ ప్రచారం కోసమూ, 'జగద్ధితం' (జగత్+హితం - లోక కల్యాణం) సాధించడం కోసమూ నన్నయ్య ఘంటం చేత బట్టాడు. కావ్యం మనోరంజకంగా ఉంటే తప్ప ప్రజలు దానిని ఆదరించరు. ప్రజలు చదివితే తప్ప వారిలో వైదిక ధర్మానురక్తి పెరుగదు. అందుచేత ప్రజలను ఆకర్షించడం కోసం నన్నయ్య 'అక్షర రమ్యత' నీ, 'ప్రసన్న కథా కలితార్థ యుక్తి' (కథా సారాంశం పఠితకు

ప్రసన్నం అయేట్టు చేయడం) నీ తన రచనలో ప్రధానంగా పాటించాడు. రుచిరార్థ (అందమైన అర్థం గల) సూక్తులను కూడా అనేకం ఆయన కూర్చాడు."



నన్నయభట్టు (1050 ప్రాంతం)

"అయితే తెలుగులో కావ్యం వ్రాసే పద్ధతికి మొదట ఒరవడి పెట్టినవాడు నన్నయ్య అన్నమాట!" అంది అమల.

అమల బుద్ధి సూక్ష్మతను మెచ్చుకుంటూ అన్నాడు తాతయ్య: "ఔను తల్లీ! సంస్కృతం లాంటి భాషలలో సాధారణంగా కావ్యంలో మధ్యలో వచనం ఉండదు. పద్యాలూ, వచనం కలగలుపు చేసి వ్రాస్తే దానిని 'చంపూ కావ్యం' అంటారు. నన్నయకు కథా కథనం ప్రధానం గనుక పద్యాల మధ్య వచనాలు కూడా చేర్చి తరువాతి మన కవిత్వం అంతా 'చంపూ' పద్ధతిలోనే సాగడానికి ఆయనే మొదట ఒరవడి పెట్టాడు.

"తెలుగులో కంటె పాటి దక్షిణాది భాషలు తమిళ, కన్నడాలలో మరికొన్ని శతాబ్దాల ముందునుంచే కవిత్వం ప్రారంభమైంది. ఛందస్సులను ఎన్నుకోడం, యతి మైత్రిని, ప్రాసమైత్రిని పాటించడం వంటి విషయాలను నన్నయ ఆ భాషా సాహిత్యాల నుంచి గ్రహించాడు. ముఖ్యంగా కన్నడ సాహిత్యపు ప్రభావం ఆయన మీద ఎక్కువగా కనిపిస్తుంది.

"ఎనిమిది భాషలలో పండితుడైన నారాయణ భట్టు భారత రచనలో నన్నయ్యకు బాసటగా నిలబడ్డాడు. భారత యుద్ధంలో అర్జునునికి శ్రీ కృష్ణునిలాగ ఆంధ్ర భారత రచనలో తనకు నారాయణభట్టు సాయపడ్డాడని నన్నయ్య చెప్పుకున్నారు. కేవలం దేశీయ పదాలలో ఉదాత్తమైన భావాలు చెప్పడం సాధ్యం కాదని నన్నయ్య సంస్కృతం నుంచి చాలా పదాలను స్వేచ్ఛగా తెలుగులోకి తీసుకువచ్చారు. అయితే - గమ్మత్తు ఏమిటంటే ఆయన తెచ్చిన సంస్కృత పదాలు కూడా తెలుగు పదాలంత మధురంగా ఉండి అవి తెలుగు పదాలే అనిపిస్తాయి".

"నన్నయ వ్రాసిన ఆ మొట్టమొదటి తెలుగు కావ్యంలో పద్యం ఎలా ఉంటుందో మచ్చుకి ఒక్కటి చదివి వినిపించవూ తాతయ్యా!" అంది గోముగా కమల.

తాతయ్య ఈ పద్యం చదివాడు :

వసంత తిలకమ్

'ఈ బాలు నెత్తుకొని యింటికి జన్న నన్నున్
నా బంధు లందఱు మనంబున నేమనా రె
ట్లీ బాలు సూర్య నిభు నిట్టుల డించి పోవం
గా బుద్ధి పుట్టు నని కన్య మనంబు లోనన్'

"కన్యగా ఉండగానే కుంతి కర్ణుణ్ణి కన్నది గదా! ఆమె ఆ బాలుణ్ణి నదిలో వదలి వెళ్ళిపోయే సందర్భంలోని ఒక మంచి రసవంతమైన పద్యం ఇది!"

"చాలా బాగుంది. చిత్రం - వెయ్యేళ్లు గడచినా, ఆ నాటి తెలుగుకూ, నేటి మన తెలుగుకూ ఎక్కువ తేడా కనిపించడం లేదు తాతయ్యా!" అంది విమల.

"వ్యావహారిక భాషలో వచ్చినంత త్వరగా లిఖిత భాషలో మార్పు రాదు తల్లీ! ఇటీవల తిరుపతి కవులదాకా, విశ్వనాథ సత్యనారాయణ దాకా ఆ నన్నయ వ్రాసిన తెలుగు భాషే ఎలాంటి పెద్ద మార్పులూ లేకుండా మన కవిత్వ భాషగా ఉపయోగించబడుతూ వచ్చింది.

"నన్నయ ఒక ఋషిలాంటి వాడు. తెలుగు భాషకు మంత్ర మహిమ చేకూర్చా లని ఆయన ప్రయత్నించాడు.

ఆది పర్వంలో 'వాసుకి మాకు ప్రసన్ను డయ్యెడిన్!' అంటూ ముగిసే నాలుగు పద్యాలున్నాయి. ఆ నాగస్తుతి చదువుకుంటే సర్ప భయం ఉండ దని ఇటీవలి వరకూ తెలుగు వారిలో ఒక గట్టి నమ్మకం ఉండేది.''

''నిజంగా ఆ పద్యాలు చదువుకుంటే సర్ప భయం ఉండదా తాతయ్యా? ఆ పద్యాలు మాకు చదివి వినిపించవూ?'' అంది అమల

''అవి సంస్కృత సమాస భూయిష్ఠాలుగా ఉంటాయి - మీకు అర్థం కావని వినిపించవ ద్దనుకున్నాను. అయినా నువ్వు ఆసక్తిగా అడుగుతున్నావు గనుక చదివి వినిపిస్తాను!'' అని తాతయ్య ఆ పద్యాలు ఇలా వినిపించాడు:

చం. బహు వన పాదపాద్రి కుల
పర్వత పూర్ణ నర స్సరస్వతీ
సహిత మహా మహీభర మజస్ర
సహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధి
శాయికిఁ బాయక శయ్య యైన య
య్యహిపతి దుష్కృతాంతకు
డనంతుడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్!''

చం. అరిది తపో విభూతి నమరారుల
బాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁ గాచిన మహోరగ
నాయకుఁ డానమత్ సురా

సుర మకుటాగ్ర రత్న రుచి
శోభిత పాదున కద్రి నందనే
శ్వరునకు భూషణం బయిన
వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్ !"

ఉ. దేవ మనుష్య లోకములఁ
ద్రిమ్మరుచున్ విపుల ప్రతాప సం
భావిత శక్తి శౌర్యులు నపార
విషోత్కట కోప విస్ఫురత్
పావక తాపి తాఖిల విపక్షులు
నైన మహానుభావులై
రావత కోటి ఘోర ఫణి
రాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్ !"

ఉ. గోత్ర మహా మహీధర నికుంజ
ములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునన్ బ్రకామ గతి ఖేలన
నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బల దర్ప
పరాక్రమ దక్షఁ దీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుఁడు శూరుఁడు
మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్!"

"నువ్వు చెప్పినట్టు మాకీ పద్యాలు స్పష్టంగా అర్థం కాని మాట నిజమే గాని తాతయ్యా ! నువ్వు చదువుతుంటే ఆ అక్షరాల కూర్పులో ఏదో మహిమ ఉన్నట్టే అనిపిస్తూంది. ఇంటికి వెళ్ళగానే ఈ పద్యాలు మాకు వ్రాసి

ఇయ్యి తాతయ్యా! వీటిని కంఠస్థం చేస్తాం. చీకట్లో వెళ తూంటే పాముల భయం లేకుండా ఇవి చదువుకోవచ్చు!" అంది అమల.

'అలాగే నమ్మా'! అని తాతయ్య తరువాతి కథ అందుకోబోతూ ఉండగా ఇలా అడిగింది కమల: "నన్నయ మొదలు పెట్టిన భారతం నన్నయ్యే ఎందుకు పూర్తి చెయ్య లేదు తాతయ్యా!"

"ఆది, సభా పర్వాలూ, అరణ్య పర్వంలో 4 ఆశ్వా సాల 162 గద్య పద్యాలూ వ్రాసేసరికి నన్నయ రచన ఆగి పోయింది. కారణం ఏమిటో స్పష్టంగా తెలియదు. నన్నయ గాని, రాజరాజ నరేంద్రుడు గాని పరమపదించి ఉండవచ్చును. సుమారు రెండు శతాబ్దుల తరువాత గాని తిక్కన, ఎర్రనలు పుట్టి తెలుగు భారత రచనను ముగించడం పడలేదు." అన్నాడు తాతయ్య.

"నన్నయ్య స్నేహితులో, మరొకరో వెంటనే భారతం కొనసాగించడానికి ఎందుకు పూనుకోలేదు తాతయ్యా!" అంది విమల.

"నన్నయ రచనతో తుల తూగేట్టు వ్రాయా లంటే మళ్ళీ అంతటి కవి పుట్టాలిగా తల్లీ!

"భారత రచన కుంటుపడడం, తెలుగు దేశంలో అస్తవ్యస్త పరిస్థితులు ఏర్పడడం ఒక్కసారిగా జరిగాయి. రాజరాజ నరేంద్రుడు మరణించాడు. అతని కుమారుడు రాజేంద్ర చోళుడు తన రాజధానిని రాజమండ్రి నుంచి తమిళ

నాడులోని తంజావూరుకి తరలించాడు. రాజమండ్రి ప్రాంతం పశ్చిమ చాళుక్యుల వశమైంది. వారు కన్నడిగులు. తెలుగు భాష అంటే వారికి పడదు. భూలోకమల్లుని పతనంతో వారి సామ్రాజ్యమూ అంతరించింది. తెలుగునాట చిన్న చిన్న సామంత రాజ్యాలు వెలిశాయి. మళ్ళీ 13 వ శతాబ్దంలో కాకతీయులు ప్రాబల్యంలోకి వచ్చేదాకా తెలుగు దేశం ఏక ప్రభుత్వం క్రిందికి రాలేదు.

''భారత రచన మూలపడినా నన్నయ ఆరంభించిన లిఖిత సాహిత్యోద్యమం మాత్రం సాగుతూనే వచ్చింది. వైదిక మత పునరుద్ధరణలో శైవ, వైష్ణవ భేదాలు పెచ్చు పెరిగాయి. భూలోకమల్లుని మంత్రి బిజ్జలుని వద్ద భండారి (ట్రెజరర్) గా ఉన్న బసవేశ్వరుడు వీరశైవ మతం స్థాపించాడు. తమ మత ప్రచారానికి దేశ భాషలను ప్రధానంగా వీరశైవులు వాడుకున్నారు. ఆ విధంగా తెలుగులో శైవ సాహిత్యం ఆరంభమైంది. మన శివ కవులలో నన్నెచోడుడు, మల్లికార్జున పండితుడు, పాల్కురికి సోమనాథుడు చెప్పుకో దగ్గవారు।

''నన్నెచోడుడు కుమార సంభవం వ్రాశాడు. దక్ష యజ్ఞ ధ్వంసం, శివ పార్వతులకు కుమార స్వామి జన్మించడం, అతడు తారకాసురుణ్ణి సంహరించడం ఇందులో ప్రధానమైన ఘట్టాలు. సంస్కృతంలో ఉద్భటుడు వ్రాసిన కుమార సంభవం దీనికి మూలం. నన్నెచోడుడు నన్నయ పద్ధతిలోనే, చంపూ కావ్యంగానే దీన్ని వ్రాశాడు. నన్నయ తన కృతిని రాజరాజుకి అంకితం చేయగా నన్నెచోడుడు

తన కృతిని తన గురువు జంగమ మల్లికార్జునునికి అంకితం చేశాడు. ఇతని రచనలో తెలుగు ఋతువుల వర్ణనలూ, తెలుగు జాతీయ సన్నివేశాల చిత్రణా మనోహరంగా ఉంటాయి. నన్నెచోడుడు తనది 'వస్తు కవిత' అన్నాడు. ఇతర శివ కవులతోపాటు ఇతడూ తన భాష 'జాను తెనుగు' అన్నాడు. కాని ఈ మాటల అర్థం విషయంలో విమర్శకులలో ఏకాభిప్రాయం లేదు. స్థూలంగా చూస్తే శివ కవుల కావ్య భాషకూ, నన్నయ కావ్య భాషకూ పెద్ద తేడా ఏమీ కనిపించడం లేదు.

"మల్లికార్జున పండితుడు (12 వ శతాబ్దం) 'శివతత్త్వ సారం' వ్రాశాడు. కందాలూ, గీతాలలో శివుని లీలలను వర్ణించే ఈ గ్రంథమే తెలుగులో మొట్టమొదటి శతకం.

"మన శివ కవులలో పాల్కురికి సోమనాథుడు ఉద్దండుడు. ఆయన వ్రాసిన పండితారాధ్య చరిత్ర, బసవ పురాణం ఈ నాటికీ తెలుగు శైవు లందరికీ వేదం లాంటివి. తెలుగులో ద్విపద కావ్య రచనకు ఈయన మూలపురుషుడు. సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో కావ్యాలు వ్రాయడంవల్ల ఈయన కీర్తి కన్నడ దేశంలో కూడా వ్యాపించింది. ఈయన అష్టభాషా విశారుదుడు. వృషాధిప శతకంలో ఈయన బహుభాషా పాండిత్యం కనిపిస్తుంది."

"ఒక ప్రక్క శైవులు విజృంభించి శైవ సాహిత్యం నిర్మిస్తూ ఉంటే మరి వైష్ణవులు ఊరుకున్నారా తాతయ్యా!" అని అడిగింది అమల.

"అదే చెప్పబోతున్నానమ్మా! ఆ రోజులలో శైవులు విజృంభించి వైష్ణవులను హింసించడం మొదలు పెట్టగా వైష్ణవులూ ఎదురు తిరిగారు. శైవ, వైష్ణవ కలహాలు ఒక రాజకీయ సమస్యగా, సాంఘిక సమస్యగా తయారయ్యాయి. అందుకే వారి మధ్య సామరస్యం నెలకొల్పడం కోసం హరిహర నాథ మతం (శివుడూ, విష్ణువూ ఒక్కరే అని చెప్పే మతం) ఉపదేశించేందుకు కవిబ్రహ్మ తిక్కన అవతరించవలసి వచ్చింది.

"వైష్ణవ సాహిత్యాన్ని గురించి చెప్పు తాతయ్యా!" అని అడిగింది కృష్ణ భక్తురాలు కమల.

"శైవుల్లాగే వైష్ణవులూ ప్రజలకు బాగా అర్థం అయ్యే ద్విపద ఛ్ఛందస్సులోనే కావ్యరచనకు పూనుకున్నారు. గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం వెలయించాడు. ఈ ద్విపద రామాయణం సంస్కృతంలోని వాల్మీకి రామాయణానికి యథేచ్ఛానువాదం. మూల కథకు స్వతంత్రంగా చేసిన కొన్ని చేర్పులూ, మార్పులూ ఈ అనువాదంలో కనిపిస్తాయి. మూలంలో లేని మూడు ప్రధాన కథలే ఇందులో చేరాయి. అవి: 1. అరణ్యకాండలో జంబుకుమారుడి కథ, 2. యుద్ధకాండలో కాలనేమి వృత్తాంతం, 3. యుద్ధ కాండలోనే సులోచన వృత్తాంతం.

"గోన బుద్ధారెడ్డి వ్రాసిన ఈ రామాయణానికి 'రంగనాథ రామయణం' అనే ప్రశస్తి ఎందుకు వచ్చిందో ఎవ్వరూ స్పష్టంగా చెప్పలేక పోతున్నారు. గోన బుద్ధారెడ్డి అయినా ఈ రామాయణంలో పూర్వ భాగం మాత్రమే వ్రాశాడు.

ఉత్తరకాండను ఆయన కుమారులు కాచవిభుడూ, విట్ఠలుడూ వ్రాశారు. గోన బుద్ధారెడ్డి పూర్వరామాయణాన్ని తన తండ్రి విట్ఠల క్ష్మానాథుని పేరా, కాచవిభుడూ, విట్ఠలుడూ ఉత్తర కాండను తమ తండ్రి బుద్ధారెడ్డి పేరా వ్రాసినట్టు చెప్తున్నారు. ద్విపదలో ఉండి పాడుకోడానికి వీలుగా ఉండడం వల్ల రంగనాథ రామాయణం - ముఖ్యంగా రాయలసీమలో - విశేషంగా ప్రజాదరణ పొందింది.''

"రంగనాథ రామాయణంలో ద్విపదలు ఎలా నడుస్తాయో నాలుగు చదివి వినిపించవా తాతయ్యా!" అని అడిగింది కమల.

దయానిధి ఈ పంక్తులు శ్రావనంగా వారికి చదివి వినిపించాడు :

ద్విపద

"ఓరి నిషాదుఁడ! యోరి పాపాత్మ!
యోరి నీ కెగ్గేమి యొనరించె తొల్లి
కామించి క్రౌంచముల్ గవయుచో నొకటి
నేమిటికై చంపి తిబ్బంగి కడగి
ఈ పాపమున నీ వనేక దుఃఖములు
ప్రాపించి తిరుగుము బహు వత్సరములు!"

దయానిధి తరువాతి కథ ఇలా కొనసాగించాడు :

''కాకతీయ సామ్రాజ్యం విస్తరించి ఆంధ్ర దేశంలో కొత్త స్తిమితం ఏర్పడడంతో అసంపూర్ణంగా ఉన్న భారత రచనను తిరిగి కొనసాగించేందుకు అనుకూల పరిస్థితులు

దేశంలో ఏర్పడ్డాయి. నెల్లూరును పాలించే మనుమసిద్ధి తన సచివుడూ,ఆస్థానకవీ అయిన తిక్కనను గౌరవంగా 'మామా!' అని పిలిచేవాడు. అందుకే తాను ముందుగా వ్రాసిన 'నిర్వచనోత్తర రామాయణాన్ని' తిక్కన ఆయనకే అంకితం చేశాడు. భారతం మాత్రం తాను ఆరాధించే హరిహర నాథునికి అంకితం చేశాడు. నన్నయ అసంపూర్ణంగా వదలిన అరణ్య పర్వాన్ని ముట్టకోకుండా విరాట పర్వం దగ్గిర నుంచీ మొదలు పెట్టి, ఒక్కచేతి మీదుగా తక్కిన 15 పర్వాలూ వ్రాసి 'హరి హరనాథ! సర్వ భువనార్చిత! నన్ గృపజూడు మెప్పుడున్' అంటూ భారతాన్ని ముగించాడు తిక్కన.

''భారత రచనకు ముందుగా తిక్కన యజ్ఞం చేసి 'సోమయాజి' అయాడు. శివ కవుల 'జాను తెనుగు' ఉద్యమాన్ని దృష్టిలో ఉంచుకొని నన్నయ కంటె ఎక్కువగా దేశ్య పదాలనూ, పలుకుబళ్ళనూ తన రచనలో ఈయన చొప్పించాడు. అయితే - తిక్కన సంస్కృతాంధ్రాలలో సమానంగా ప్రతిభ ప్రదర్శించాడు. అందుకే ఆయనను 'ఉభయ కవి మిత్రుడు' అన్నారు. ఆయన దృష్టిలో భారతం పంచమ వేదమే కాదు; ధర్మాద్వైత మూర్తి - అంటే ధర్మశాస్త్రం లాంటిదే! సమస్త మానవ ధర్మాలూ దానిలో ఉన్నాయి. 'ఆంధ్రావళి మోదముం బొరయ' తాను భారతాన్ని తెలుగు చేస్తున్నానని ఆయన చెప్పుకున్నాడు. నన్నయది ఆఖ్యానక శైలి (కథా కథన శైలి) అయితే, తిక్కనది నాటకీయ శైలి. భారతంలోని పాత్ర లన్నీ మన

కళ్ళ ఎదుట ప్రత్యక్షంగా కనిపిస్తూ అన్యోన్య సంభాషణలు సాగిస్తాయి ఆయన భారతంలో!''



తిక్కన (1250 ప్రాంతం)

''నన్నయ పద్యాలు చదివి వినిపించి నట్టు తిక్కన పద్యాలు కూడా రెండు చదివి వినిపించు తాతయ్యా! అవి

మాకు పూర్తిగా అర్థం అయినా కాకపోయినా ఆయన కాలం నాటి తెలుగు పద్య శైలి ఎలా ఉంటుందో చూద్దాం!" అంది విమల.

"తిక్కన్న తెలుగుమాటలు ఎక్కువగా వాడినా ఆ మాట లన్నీ ఇప్పుడు వ్యవహారంలో లేనందువల్ల ఆయన పద్యాలూ మీకు పూర్తిగా అర్థం కావు. అయినా అడిగావు గనుక రెండంటే రెండే పద్యాలు వినిపిస్తాను.

"ఒకటి - కృష్ణుడు ధృతరాష్ట్రుని కొలువుకు రాయబారిగా వెళ్ళినప్పుడు చెప్పిన పద్యం:

ఉ. కంసుడు నిట్లు తండ్రి మది కందెదు
　　చంద మొనర్చి ధర్మ వి
ధ్వంసము చేసినం గులము వారలు
　　నా కెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయు వైద్యుని క్రమంబున
　　నాతనిఁ ద్రుంచి యున్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ
　　దద్విధ మొప్పదె మీకుఁ జేసినన్!

"ఇంకో పద్యం ధర్మానికి తిక్కన చెప్పించిన నిర్వచనం:

కం. ఒరు లే యవి యొనరించిన
నరవర! యప్రియము తన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్!"

తాతయ్య అలా తిక్కన పద్యాలు చదివి వినిపించి తరువాతి కథ అందుకోబోతున్నాడు.

''మరి అరణ్యపర్వంలో మిగిలిపోయిన భాగాన్ని ఎర్రాప్రెగడ పూర్తిచేసింది తిక్కన కంటె ముందు కాదా తాతయ్యా?'' అని అడిగింది కమల.

''కాదమ్మా! తిక్కన తరువాత సుమారు నూరేళ్ళకు గాని ఎర్రన అరణ్య పర్వం పూరించడం జరుగలేదు. తిక్కన తరువాత దేశంలో మళ్ళీ అరాజకం చెలరేగింది. ముస్లిము దాడులవల్ల కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. తుంగభద్రానది ఒడ్డున హరిహర రాయలూ, బుక్క రాయలూ మరో సామ్రాజ్యానికి అంకురార్పణ చేశారు. అద్దంకిని రాజధానిగా చేసుకుని రెడ్డిరాజులు పరిపాలన చేయసాగారు. ఆ రెడ్డి రాజులలో ప్రోలయ వేమారెడ్డి ఆస్థాన కవి ఎర్రాప్రెగడ. ఆయన అరణ్య పర్వాన్ని పూరించడమే కాకుండా భారతానికి పూరకం అని చెప్పబడే హరివంశాన్ని కూడా తెలుగు చేశాడు. 'నృసింహ పురాణం' అనే ప్రహ్లాద చరిత్రను మనోహరంగా తెలుగు జాతీయత ఉట్టి పడేట్టు ఆయన రచించాడు. 'ప్రబంధ పరమేశ్వరుడు' అనీ, 'శంభు దాసుడు' అనీ ఎర్రన ప్రసిద్ధి పొందాడు.''

''అదృష్టం అంటే ఎర్రనదే అదృష్టం తాతయ్యా! ఒక పర్వంలో సగం మాత్రమే వ్రాసి నన్నయ, తిక్కనలతోపాటు కవిత్రయంలో ఒకడుగా ప్రసిద్ధి కొట్టేశాడు ఆయన!'' అంది కమల చమత్కారంగా.

ఆమెను మందలిస్తూ తాతయ్య అన్నాడు: ''తప్పు! అలా అనకూడదమ్మా! వ్రాసిన భారత భాగం స్వల్పమైనా ఆయన కవితాశక్తి నన్నయ తిక్కనల కవితా శక్తికి



ఎర్రన (*1350* ప్రాంతం)

ఏ మాత్రం తీసిపోయేది కాదు. ఆయన వ్రాసిన అరణ్య పర్వ భాగంలో 'ఘోషయాత్ర', 'రామోపాఖ్యానం', 'సావిత్ర్యు

పాఖ్యానం' వంటి రసవద్ఘట్టాలెన్నో ఉన్నాయి. అవి అన్నీ అమిత ప్రజాదరణ చూరగొన్నాయి. పైగా ఆయన సాధించిన కార్యం అతి జటిలమైంది. నన్నయ శైలితో ప్రారంభించి తిక్కన శైలితో అరణ్య పర్వాన్ని ముగిస్తూ నన్నయ, తిక్కనల రచనల మధ్య ఒక వారధి (వంతెన) గా ఆయన తన రచనను రూపొందించవలసి వచ్చింది.

"అరణ్య పర్వం పూర్తిచేసి చిట్టచివర ఎఱ్ఱాప్రెగడ తనను గురించి ఇలా చెప్పుకుంటాడు:

సీ. దివ్య చరిత్రుఁ డాపస్తంభ సూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివ పదాబ్జ
సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుఁ డిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణ గరిష్ఠత నొప్పు
ధన్యుడు ధర్మైక తత్పరాత్ముఁ

తే. డెఱ్ఱి నార్యుండు సకల లోకైక విదితుఁ
డయిన నన్నయ భట్టు మహా కవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష సిద్ధిఁ గోరి.

కం. ధీర విచారుఁడు తత్కవి
తా రీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయు కా
నారణ్య పర్వ శేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్ !"

"బాగుంది తాతయ్యా! కవిత్రయంలో ఎవ్వరి మీదా
పాతం చూపించకుండా ఎఱ్రన పద్యాలు కూడా రెండు
పించావు. ఆయన పద్యాలు అచ్చం నన్నయ పద్యాల్లాగే
పిస్తున్నాయి. అలా వ్రాయడం కష్టం కదూ తాతయ్యా?"
మెచ్చుకుంది విమల.

తాతయ్య తరువాతి కథ ఇలా అందుకున్నాడు :

"ఎఱ్రన సమకాలికుడు మరో తెలుగు మహాకవి
న్నాడు - నాచన సోమన్న! ఆయన 'కవిత్రయం'తో దీటు
గల మహాకవి. ఆయన వ్రాసిన ఉత్తర హరివంశం చాలా
ప్ప కావ్యం. శృంగార, వీర రసాలు పోషించడంలో
మన పెట్టింది పేరు. ఆయనకు 'సంవిధాన చక్రవర్తి',
'హిత్య రసపోషణ', 'నవీన గుణసనాథ' లాంటి సార్థక
న బిరుదు లెన్నో ఉన్నాయి. ప్రాచీన తెలుగు సాహిత్యంతో
చయం ఉన్నవారిలో ఆయన పద్యాలలో కొన్ని అయినా
ఠస్థంగా రాని వారంటూ ఉండరు.

"ఈ కవిత్రయ కాలానికే సంబంధించిన మరొక
ప్పకవి హుళక్కి భాస్కరుడు. ఆయన వ్రాసిన 'భాస్కర
మాయణం' తెలుగులో విశేషంగా ప్రసిద్ధి పొందింది.
పదరామాయణాలలో 'రంగనాథ రామాయణం', చంపూ
మాయణాలలో 'భాస్కర రామాయణం' తెలుగులో చెప్పు
దగ్గవి. భాస్కరుని పేరుతోనే ఆ రామాయణం పిలువ
పతున్నా నిజానికి దానిలో ఆయన వ్రాసింది స్వల్పమే!
ది ముగ్గురు కవుల తోడ్పాటుతో ఆ రామాయణం పూర్తి

యింది. ఆ ముగ్గురు: మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు."

ఉన్నట్టుండి మబ్బులు క్రమ్మి వర్షం వచ్చే సూచనలు కనిపించాయి. తాతయ్య అన్నాడు: "కవిత్రయ కాలంలో మైలు రాళ్లు అనదగిన ప్రధాన కవులను గురించి మాత్రమే ఇంతవరకు మీకు నేను చెప్పాను. వీరు కాక కేతన, మారన, మంచెన, యథావాక్కుల అన్నమయ్య, పావులూరి మల్లన, వేములవాడ భీమకవి వంటి మరి ఎందరో ఉద్దండ కవు లున్నారు. వారిని గురించీ, వారి రచనలను గురించీ మీరు పెద్ద అయిన తరువాత స్వయంగా చదువుకుందురు గాని!"

"ఆ కాలంలో తెలుగులో భారతం, రామాయణం మాత్రమే వెలిశాయి. మరి భాగవతం ఎవ్వరూ ఎందుకు వ్రాయలేదు తాతయ్యా!" అని అడిగింది తెలివిగా అమల.

ఆ ప్రశ్నకు ఆ పిల్లను మెచ్చుకుంటూ తాతయ్య ఇలా జవాబు చెప్పాడు: "పోతన అన్నట్టు అది ఆయన అదృష్టం అమ్మా!

'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విన్ బురాణావళిన్
తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్........'

అంటాడు పోతన. నిజానికి అది పోతనగారి పూర్వజన్మ సుకృతం మాత్రమే కాదు; భాగవతం ఆయన చేతులలో పడడం మన తెలుగు జాతి నోచుకున్న నోముల ఫలం!"

సన్నగా చినుకులు ఆరంభమయాయి. హడావిడిగా కోటయ్య కట్టిన బండి ఎక్కి అంతా ఇంటికి బయలుదేరారు.

౩

# పరికెదిరి భాగవతమట

మూడో రోజు పిల్లలకు మామిడి తోట అంటే బోరు కొట్టింది. ''ఇవాళ మనం శోభనాచల స్వామి కొండ ఎక్కుదాం తాతయ్యా!'' అన్నారు వాళ్ళు.

షష్టి పూర్తి దగ్గిర పడుతున్న దయానిధి అన్ని మెట్లెక్కడానికి మొదట కొంచెం వెనుకాడినా, మనుమరాళ్ళ ప్రోత్సాహ బలంతో చివరికి 'సరే! అలాగే లే అమ్మా!' అనక తప్పింది కాదు.

కొండ మధ్యలో ఉన్న శోభనాచల స్వామి ఆలయ సందర్శనంతో సంతృప్తి పడక కొండ శిఖరాన ఉన్న మల్లేశ్వరస్వామి గుడికి దారి తీశారు మనుమరాళ్ళు. కోటయ్య తెచ్చిన జంపకానా ఒక సమ తలాన పరుచుకొని అంతా కూచున్నారు. క్రింద నుంచి వెంట తెచ్చుకున్న మంచినీళ్లూ, కాఫీ తాగి సేద దీర్చుకున్నారు. అక్కడనుంచి ఎటు చూసినా పదిహేను కిలో మీటరుల మేర పచ్చని చెట్లూ, ఆ చెట్ల గుబురుల ఒడిలో పల్లెలూ - మనోహరమైన ఆ దృశ్యం

ఆ బస్తీ పిల్లలను బాగా ఆకర్షించింది. ఉల్లాసంగా చల్లని గాలి వీస్తూంది.

"ఇవాళ మాకు మన ప్రబంధ కవులను గురించి చెబుతావా తాతయ్యా?" అని అడిగింది అమల.

"అప్పుడే ఎక్కడ ప్రబంధ కవు లమ్మా! 16 వ శతాబ్దంలో గాని ప్రబంధ యుగం ఆరంభం కాదు. ఇంకా మనం 1400 దగ్గరే ఉన్నాం. 1400 నుంచి 1500 దాకా గడచిన శతాబ్దం రాబోయే ప్రబంధ యుగానికి మార్గం ఏర్పరచిన సంధి యుగం. అయితే ఈయుగంలో దేవాలయ ధ్వజ స్తంభాల్లాంటి మహోన్నతమైన ఇద్దరు మహాకవులు తెలుగు దేశంలో పుట్టారు. ఒకరు శ్రీనాథుడు, మరొకరు పోతన. వీ రిద్దరిలో ఒకరు ఉత్తర ధ్రువం అయితే, మరొకరు దక్షిణ ధ్రువం. ఒకడు ఎంత రక్తుడో, మరొకడు అంత విరక్తుడు, భక్తుడు. అయినా ఈ ఇద్దరూ తెలుగు భాషకూ, తెలుగు సాహిత్యానికీ తీర్చి దిద్దిన అలంకారాలు మనం ఎన్నటికీ మరచిపోరానివి.

శ్రీనాథుని జీవితాన్ని గురించి మనకు తెలిసినన్ని విశేషాలు బహుశః ఏ ఇతర ప్రాచీన ఆంధ్ర కవిని గురించీ మనకు తెలియవు. దీనికి కారణం ఆయన కవిత్వం ఆయన జీవితంలో ఒక భాగమై పోవడం. జీవితంలో అడుగడుగునా తన అనుభూతులను ఆయన చాటు పద్యాలుగా చెబుతూ వచ్చాడు. ఆధునికులలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి వంటి వారికెందరికో కవితా కళలోనే కాక, జీవన కళలో కూడా ఉదాత్తమైన ఒరవడి పెట్టిన కవి సార్వభౌముడమ్మా శ్రీనాథుడు!

"ఆయనను గురించి ఊహ్ పొగడడమే గాని ఆయన కథ చెప్పవేం తాతయ్యా!" అంది కొంటె కమల.

"అంత తొందరైతే ఎలా తల్లీ? అదే చెబుతున్నాను. కాల్పట్టణంలో ఒక అమాత్య కుటుంబంలో శ్రీనాథుడు జన్మించాడు. ఆయన తాత కమలనాభామాత్యుడు 'పద్మ



శ్రీనాథ కవిసార్వభౌముడు (1400 ప్రాంతం)

పురాణం' అనే ఉద్గ్రంథం వ్రాసిన మహనీయుడు. కొండవీటిలో పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో కొన్నాళ్లూ, రాజమండ్రిలో వీరభద్రారెడ్డి కొలువులో కొన్నాళ్లా 'విద్యాశాఖాధికారి' వంటి ఉన్నత పదవులు నిర్వహించాడు శ్రీనాథుడు. నిరంతరం రాజులతోనూ, మంత్రులతోనూ సరస సాహిత్య

గోష్ఠులు జరుపుతూ విలాస జీవితం గడిపాడు ఆయన. రాజ నీతి చతురతతో రాజుల మధ్య రాయబారాలు నడిపాడు. తన ఎనభై ఏళ్ళ నిండు జీవితంలో ఉత్తరాన సింహాచలం మొదలు దక్షిణాన శ్రీరంగం దాకా విరివిగా దేశపర్యటనలు చేశాడు. వివిధ ప్రాంతాల స్త్రీలను తన చాటువులలో ఆయన వర్ణించాడు. పెద కోమటి వేమారెడ్డితో కలసి కాశీ కూడా సందర్శించి వచ్చాడని కొందరంటున్నారు.

"తాతయ్యా! శ్రీనాథుడు గొప్ప శృంగార పురుషుడటగా! మొగపిల్లలెవరైనా క్లాసులోకి విలాసంగా వేషం వేసుకువస్తే ఏంరా? శ్రీనాథుడి పోజులు కొడుతున్నావు? అంటారులే మా తెలుగు టీచరు! అంది కమల.

"శ్రీనాథుడు కొంతవరకు భోగి, శృంగార పురుషుడు అనే మాట నిజమే గాని, ఆయన ఎంత భోగో అంత ఈశ్వర పదార్చనాసక్తుడు. ఆయన వ్రాసిన 'కాశీ ఖండం', 'భీమ ఖండం', 'హర విలాసం', 'శివరాత్రి మాహాత్మ్యం' వంటి కావ్యాలలో ఆయన అసాధారణమైన ఈశ్వర భక్తి మనకు కనిపిస్తుంది.

"అయితే - ఆయన 'శృంగార నైషధం', 'క్రీడాభిరామం' వంటి కావ్యాలలోనూ, కొన్ని చాటువులలోనూ కొంత అశ్లీల శృంగారం, బూతు కనిపించే మాట నిజమే! కాని ఇక్కడ ఒక సంగతి మనం గుర్తుంచుకోవాలి. ఎంతటి మహా పండితుడైనా, ఎంతటి ఆధ్యాత్మికవేత్త అయినా జీవితాన్ని ఆయన అంత గాఢంగా ప్రేమించిన మరొక తెలుగుకవి మనకు కనిపించడు. అందుకే తెలుగు కవిత్వానికి నూతన

పటుత్వాన్నీ, జీవశక్తినీ పూరించి తరువాతి ప్రబంధ యుగానికి ఆయన మార్గదర్శకుడు కాగలిగాడు."

"కవి సార్వభౌము డనే బిరుదు శ్రీనాథునికి ఎలా వచ్చింది తాతయ్యా!" అని అడిగింది కుతూహలంగా విమల.

"ఒకప్పుడు శ్రీనాథుడు ఏదో రాజకార్యం మీద ప్రౌఢ దేవరాయల ఆస్థానానికి వెళ్ళాడు. అక్కడ గౌడ డిండిమ భట్టు అనే పండితుడు శాస్త్రవాదంలో తన నెవ్వరూ ఓడించ లేరని గర్వంగా ఒక కంచుఢక్కా మోగించేవాడు. శ్రీనాథుడు వాదంలో ఆయనను ఓడించి, ఆయన ఢక్కా పగుల గొట్టిం చాడు. అప్పుడు ప్రౌఢదేవరాయలు ఆయనకు కనకాభిషేకం చేయించి, 'కవి సార్వభౌము'డనే బిరుదు ఇచ్చాడు.

"రాజాస్థానాలలోనూ, విద్వాంసుల మధ్యా ఎంత చను వుగా మెలిగాడో, ప్రజాసామాన్యంలోనూ అంతగా కలిసి పోయాడు శ్రీనాథుడు. ఒక నాటక సమాజం వారి కోసం 'క్రీడాభిరామం' వ్రాశాడు. ప్రజలు ఉత్తేజంతో పరవశించి పాడుకోడం కోసం 'పలనాటి వీర చరిత్ర' అనే ద్విపద కావ్యం వ్రాశాడు. తెలుగు కవులలో సర్వ సమగ్రమైన, పరి పూర్ణమైన వ్యక్తిత్వం గల కవి శ్రీనాథుడు.

"శ్రీనాథుడు చాలా చాటువులు కూడా చెప్పా డన్నావు గదా తాతయ్యా! సరదాగా ఒకటి రెండు చాటువులు మాకు వినిపించవూ?" అని అడిగింది అమల.

"ఔనమ్మా! ఆధునిక యుగంలోని తిరుపతి వేంకట కవుల్లాగ తన జీవితంలో అడు గడుగునా కవిత్వం చెప్పిన

సరస కవి శ్రీనాథుడు. ఆయన విరివిగా దేశ సంచారం చేశాడు. తాను చూసిన వివిధ దేశాల విశేషాలను చమత్కారంగా-చదవగానే గుర్తుండి పోయేటంత చాటువులుగా - ఆయన చెబుతూ వచ్చాడు. ఆయన చెప్పిన చాటువులు దాదాపు 140 దాకా ఉన్నాయి. కాని, మనకు టైము లేదు. రెండు చిన్న చాటువులు మాత్రం మీకు చదివి వినిపిస్తాను.

"అరవ వారిలో 'పిళ్ళై'లు అని ఉంటారు. అలాంటి ఒక అరవ పిళ్లైను చూసి ఎగతాళిగా శ్రీనాథుడు చెప్పిన పద్యం వినండి :

గీ. మేత కరిపిల్ల, పోరున మేకపిల్ల
పారుబోతు తనంబున పందిపిల్ల
ఎల్ల పనులను చెరుపంగ పిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల - ఈ అరవ పిళ్ళ!

"కరి పిల్ల" అంటే ఏనుగు గున్న. మరో చిన్న పద్యం పల్నాడులో తిరుగుతూ ఉండగా మంచి నీరు దొరక్క బాధ పడుతూ శ్రీనాథుడు చెప్పింది. ఆయన ఈశ్వరుణ్ణి ఇలా నిలదీశాడు :

కం. సిరిగల వానికి చెల్లును
తరుణుల పదియారు వేల తగ పెండ్లాడన్ ;
తిరిపెమున కిద్దరాండ్రా ?
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్!

"సమస్త సంపదలతోనూ తులతూగే శ్రీకృష్ణుడికి 16,000 మంది భార్య లుంటే ఉండవచ్చు గాని, బిచ్చ మెత్తు

కొనే నీకు ఇద్దరు భార్య లెందుకయ్యా ఈశ్వరా! పార్వతిని నువు ఉంచుకుని, గంగను మాకు విడిచిపెడుదూ!" అంటాడు.

"ఈ పద్యాలు మాకు వ్రాసి ఇయ్యి తాతయ్యా! మేము నేర్చుకుంటాము. తెలుగులో ఇలాంటి సరదా అయిన హాస్య పద్యాలు చాలా తక్కువ!" అంది కమల.

"అలాగే నమ్మా! ఇంటి కెళ్ళాక గుర్తు చెయ్యండి. వ్రాసి ఇస్తాను. సరే - ఇక తరువాతి కథ వినండి:

"ఎంత ఘనంగా బ్రదికినా చివరి రోజులు శ్రీనాథునకు సవ్యంగా వెళ్ళలేదు. కృష్ణా తీరాన ఉన్న 'బొడ్డుపల్లి' అనే గ్రామంలో ఆయన వ్యవసాయం మొదలు పెట్టాడు. కృష్ణ వరద వచ్చి చల్లిన నువ్వులూ, పెసలూ వరదలలో కొట్టుకు పోయాయి. పంట పోయినా పన్ను 700 టంకాలు చెల్లించమని ప్రభువు ఒత్తిడి చేశాడు.

**బిల బిలాక్షులు తినిపోయె తిలలు పెసలు**
**కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము**
**బొడ్డుపల్లిని గొడ్డేరి మోసపోతి**
**ఎట్లు చెల్లింతు టంకంబు లేడు నూర్లు?**

అని శ్రీనాథుడు వాపోయాడు.

"అతి దీనావస్థలో ప్రాణాలు వదులుతూ ఆఖరి క్షణంలో కూడా -

**దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనగ**
**అరుగుచున్నాడు శ్రీనాథు డమర పురికి**

అంటూ అపూర్వమైన ఆత్మాభిమానాన్ని చాటిన అభిమాన ధనుడు శ్రీనాథుడు!"

'ఇక పోతన్నను గురించి చెప్పడానికి ఏమీ మిగల్చకుండా శ్రీనాథుణ్ణి గురించే గొప్పగా చెప్పేశావు తాతయ్యా!" అంది అమల.

"లేదమ్మా - ముందుగానే చెప్పాను గదా-వారిద్దరూ ఎవరి మార్గంలో వారు మేరు పర్వతాల వంటివా రని! ఒక విధంగా చూస్తే శ్రీనాథుని కంటె కూడా గొప్పవాడు పోతన. శ్రీనాథుణ్ణి చూస్తే మనకు భయం, గౌరవం కలిగితే, పోతన్నను చూస్తే భక్తి, ఆత్మీయతా పొడమి, చేతులు జోడించి ఆయన ముందు మోకరిల్లుతాం!"

"పోతన సినిమాలో శ్రీనాథుడూ, పోతనా బావమరదు లనీ, పోతన వ్యవసాయదారు డనీ - ఇలా ఏవేవో కథలు చూపించారు గదా! అవన్నీ నిజమేనా తాతయ్యా? లేకపోతే సినిమావాళ్లు కలిపించినవా?" అని అడిగింది అమల.

"తర తరాలుగా మన తెలుగువారు చెప్పుకుంటూ వచ్చిన కథలనే సినిమా వారు గ్రహించారు. ప్రజల నోళ్ళలో కొంచెం అతిశయోక్తి చోటుచేసుకున్నా అసలు కథలు నిజమే అయి ఉండాలి. అయితే ఆ ఇద్దరు కవులూ మాత్రం తమ గ్రంథాలలో ఎక్కడా ఒకరి నొకరు స్మరించడం గాని, తమ బంధుత్వం సంగతి ఎత్తడం గాని చేయలేదు.

"పోతన యోగి, విరాగి, మహాభక్తుడు. తెలుగు కవులలో ఆయనంతగా పరిణతి చెందిన ఆధ్యాత్మిక కవులు-వేమన్న, రామదాసు, త్యాగయ్య వంటి మరి ముగ్గురు నలుగురు కంటె ఎక్కువ మనకు కనిపించరు. తెలుగు కవులలో అధిక సంఖ్యాకులు లౌకికులే!

"మీరు సినిమాలో చూసిన విధంగా పోతన నిజంగానే పరమ నిరాడంబరుడు, ఐహిక భోగాల పట్ల ఆసక్తి లేనివాడు; రామభక్తుడు. ఆ రాముని కంకితంగానే భాగవతం చెప్పాడు. కవిత్వం తాను చెప్పడం లేదనీ, రాముడే తనచేత పలికిస్తున్నాడనీ ధృఢంగా విశ్వసించిన వినమ్ర స్వభావుడు ఆయన. భాగవతం అవతారికలో ఆయన ఇలా అంటాడు:

కం. పలికెడిది భాగవత మట!
పలికించెడి వాడు రామభద్రుం డట, నే
పలికిన భవహర మగు నట
పలికెద వేరొండు గాథ పలుకగ నేలా?

"తన కావ్యాన్ని మానవ మాత్రునికి అంకితం చేయడానికి ఆయన నిరాకరించాడు. ఒకప్పుడు ఒక ప్రభువు ఆ కావ్యం తనకు కృతి ఇమ్మని కోరగా ఆ రాత్రి కలలో ఆయనకు సరస్వతీ దేవి కనిపించి తన కాటుక కళ్లవెంట కన్నీరు కార్చిందట! అప్పుడు ఆమెను ఓదారుస్తూ ఆయన ఇలా పద్యం చెప్పాడు:

ఉ. కాటుక కంటినీరు చనుకట్టు పయిం బడ ఏల నేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని గాదిలి కోడల! ఓ మదంబ! ఓ
హాటక గర్భు రాణి! నిను ఆఁకటికిం గొనిపోయి అల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ - నమ్ము భారతీ!



*బమ్మెర పోతనామాత్యుడు (1400 ప్రాంతం)*

"సంస్కృతంలో భాగవతానికి గల శ్రీధరీయ వ్యాఖ్యానం కూడా బాగా చదివి తెలుగులో అది స్వతంత్ర కావ్యం అనిపించేటంత మధురంగా భాగవతాన్ని పోతనగారు తెనిగించారు. తెలుగు పద్యం నడకను ఆయన సరళం చేశారు.

భక్తి కవిత్వానికి అనుకూలమైన పద్ధతిలో అనుప్రాసాలంకారాలతో తెలుగు పద్య రచనా శైలిని పూర్తిగా మార్చివేసిన మహానుభావుడు ఆయన!

"ప్రాచీనాంధ్ర కవులలో కవిత్రయం వారి పద్యం ఏదీ నోటికి రాని తెలుగు వాడికి కూడా పోతన పద్యాలు కొన్నైనా నోటికి వచ్చి ఉంటాయి. ఇందుకు కారణాలు రెండు : ఒకటి - ఆ పద్యాల నడక అంత ధారాళంగా ఉంటుంది. రెండు : ఇటీవలి వరకూ బాల్యంలో మగ పిల్లలకు గజేంద్రమోక్షం, ఆడ పిల్లలకు రుక్మిణీ కల్యాణం బాగా చిన్నతనంలోనే తల్లి దండ్రులు నోటికి వచ్చేట్టు చెప్పేవారు."

తాతయ్య అంత వరకూ చెప్పి మనుమరాళ్లకు పరీక్ష పెట్టాడు. "ఏదీ పోతన పద్యం మీకు వచ్చింది ఒక్కొక్కరు ఒక్కొక్కటి చదవండి చూద్దాం!" అన్నాడు.

'ముందుగా నేను నేను!' అంటూ కమల ఈ పద్యం చదివింది :

గీ. చేతులారంగ శివుని పూజింప దేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువ దేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ దేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు!'

వెంటనే విమల ఇలా అందుకుంది :

కం. ఇందుఁ గల డందు లేడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,
డెందెందు వెదకి చూచిన
అందందే గలడు - దానవాగ్రణి! వింటే?

తరువాత అమల తన పెద్దరికం చూపుకోడానికి ఇలా ఒక సీస పద్యం ఎత్తుకుంది:

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

గీ. దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీ ధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరు మనియెడి తండ్రి తండ్రి!

'భేష్!' అన్నాడు తాతయ్య. "చూశారా? కుప్పి గంతుల సినీమాలూ, చేతబడి కథలూ పిల్లల మనస్సులను పాడుచేస్తున్న ఈ రోజులలో కూడా మీకు పోతన పద్యాలు నోటికి వచ్చాయంటే మన జాతిమీద పోతన భాగవతం ప్రభావం అంత తేలికగా పోయేది కాదని నిర్ధారణ అవుతూంది."

ఆయన ధోరణిని మధ్యలో అరికట్టి అమల అంది: "సరే గాని తాతయ్యా! భారతంలాగ కాకుండా భాగవతం అంతా పోతన్న ఒక్కడే చేతి మీదుగానే వ్రాశాడా?"

"ఇప్పుడు మనకు లభిస్తున్న భాగవతంలో పోతన రచనతో పాటు మరి ముగ్గురి రచనలు కనిపిస్తున్నాయి. మొదట పోతన భాగవతం పూర్తిగానే వ్రాశాడనీ, అయితే తనకు అంకితం ఇవ్వడానికి నిరాకరించా డనే కోపంతో ఒక ప్రభువు దానిని భూస్థాపితం చేయించా డనీ, తిరిగి ఆ గ్రంథం బయటికి తీసేనాటికి కొన్ని భాగాలు శిథిలం కాగా, ఆ భాగాలను ఆయన శిష్యులు గంగన, సింగన, వెలిగందల నారయ అనే వారు పూరించా రనీ చెబుతున్నారు.

"పోతన భాగవతం ఎంత ప్రశస్తి చెందిం దంటే మన పొరుగువారైన మహారాష్ట్రులు సంస్కృత భాగవతాన్ని కాకుండా తెలుగు నుంచి పోతన్న భాగవతాన్నే మరాఠీ భాషలోకి అనువదించుకున్నా రట !

"పోతన ఇంకా బాగా పరిణతి చెందక మునుపు 'భోగినీ దండకం', 'వీరభద్ర విజయం' అనే రెండు కావ్యాలు వ్రాశారు గాని అవి భాగవతం ముందు దిగదుడుపు !

"శ్రీనాథుడూ, పోతనా పుట్టిన ఈ సంధియుగంలో మరి అనేక నూతన ధోరణులు తెలుగు కవిత్వంలో వచ్చాయి. అంతకు ముందు ఎక్కువగా సంస్కృతం నుంచి అనువదించడమే పనిగా పెట్టుకున్నారు తెలుగు కవులు. ఈ యుగంలో కూడా కవులు కొన్ని సంస్కృత మూలాలను గ్రహించినా రచనలో వెనకటి వారి కంటె మరింత స్వాతంత్ర్యం ప్రదర్శించారు. పిల్లలమర్రి పినవీరన 'వాణి నా రాణి' అని చెప్పుకునేవా డంటారు. సంస్కృతంలో కాళి

దాసు వ్రాసిన 'అభిజ్ఞాన శాకుంతలం' అనే నాటకాన్నీ, సంస్కృత భారతంలోని శకుంతలోపాఖ్యానాన్నీ ఆధారంగా చేసుకుని ఆయన తెలుగులో 'శృంగార శాకుంతలం' అనే కావ్యం వ్రాశాడు. తరువాత వచ్చిన ప్రబంధాలకు ఒరవడి పెట్టిన ప్రాచీన కావ్యాలలో ఇది ఒకటి. ఈయనే 'జైమిని భారతం'లోని అశ్వమేధ పర్వాన్ని తెనిగించాడు. వ్యాసుని భారతంలోని అశ్వమేధ పర్వంలో కంటె దీనిలో మరి కొన్ని చిత్రమైన కథ లున్నాయి.

"సంస్కృత నాటకాలను తెలుగు కావ్యాలుగా అనువదించే పద్ధతిని కొనసాగిస్తూ నంది మల్లయ, ఘంట సింగన అనే జంట కవులు సంస్కృతంలో 'కృష్ణ మిశ్రుడు' రచించిన 'ప్రబంధ చంద్రోదయం' అనే అన్యాపదేశ నాటకాన్ని తెనుగులోకి కావ్యరూపంలో అనువదించారు. వీరు 'వరాహ పురాణం' కూడా తెనిగించారు. కాని దానికి ప్రబంధ చంద్రోదయానికి వచ్చినంత ప్రశస్తి రాలేదు.

"అంతకు ముందే, కవిత్రయ యుగంలోనే కేతన 'దశ కుమార చరిత్ర', మంచన 'కేయూరబాహు చరిత్ర'వంటి కథా కావ్యాలు వచ్చాయి. ఈ సంధి యుగంలో కూడా ఆ ప్రక్రియకు బాగా పుష్టి చేకూరింది. జక్కన కవి 'విక్రమార్క చరిత్ర' అనే కథా కావ్యం వ్రాశాడు. కథా శ్రవణ కుతూహలం తెలుగు వారికి మొదటినుంచీ ఎక్కువ అనిపిస్తుంది. ఈ కావ్యంలోని కథ లన్నీ చాలా చమత్కారంగా ఉంటాయి.

"అనంతామాత్యుడు వ్రాసిన 'భోజరాజీయం', కొరవి గోపరాజు వ్రాసిన 'సింహాసన ద్వాత్రింశిక' కూడా ఈ యుగంలో వెలసిన కథా కావ్యాలలో చెప్పుకోదగ్గవి.

"ద్విపద కావ్యశాఖకు కూడా ఈ యుగంలో పుష్టి చేకూరింది. గౌరన 'నవ నాథ చరిత్ర', 'హరిశ్చంద్రోపాఖ్యానం' అనే రెండు ద్విపద కావ్యాలు వ్రాశాడు. ఆధునిక కాలంలో బాగా ప్రచారంలోకి వచ్చిన సారంగధర కథ మొట్టమొదట ఆ 'నవ నాథ చరిత్ర'లోనే పుట్టింది."

ముసి ముసి చీకటి పడుతూంది. పిల్లలతో త్వరగా ఇల్లు చేరకపోతే అక్కడ పురుగూ, పుట్రా ఉంటాయని దయానిధి భయం. అందుకని ఆ యుగం తెలుగు కవిత్వం కథ త్వర త్వరగా ముగించాలని తొందరపడుతూ ఆయన ఇలా అన్నాడు:

"కవిత్రయ కాలానికి చెందిన కావ్యాలూ, కవులూ మనకు స్వల్పంగానే తెలుసు. కాని సాహిత్య చరిత్రలో పోను పోను ఎక్కువెక్కువ మంది కవులను గూర్చి, వారి కావ్యాలను గూర్చి మనకు తెలుస్తుంది. ఈ సంధి యుగం నూరు ఏళ్లే అయినా ఆ కాలానికి సంబంధించిన కవులూ, కావ్యాలూ ఎక్కువగా వెలుగులోకి రావడం జరిగింది. అందరిని గురించీ విపరంగా చెప్పుకోడం మనకు సాధ్యం గాదు. ముఖ్యమైన కొద్ది మందిని గురించి మాత్రమే నేను చెబుతాను. తక్కిన వారిని గురించి మీరు సరదాగా ఏ తెలుగు సాహిత్య చరిత్రలోనో, తెలుగు విజ్ఞాన సర్వస్వం లోనో చదివి తెలుసుకోండి.

"ఈ యుగం చివర తుదిమెరుపు లాగ మెరిసిన ఒక మహానుభావుడు తాళ్లపాక అన్నమాచార్యులు. తిరుపతి వెంకన్న తప్ప మరో దైవం లేడని నమ్మిన మహా భక్తుడు ఆయన. ఆయన వ్రాసిన 32 వేల పదాలు (సంకీర్తనలు) రాగి రేకుల మీద వ్రాసి భద్రపరచినవి - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి చలువ వలన ఇటీవల వెలుగులోకి వచ్చాయి. తెలుగులో పద కవితకు ఆయనే పితామహుడు. కర్ణాటక లోని పురందర దాసుకు ఆయన సమ కాలికుడు.



తాళ్ళపాక అన్నమాచార్యులు
(1400 ప్రాంతం)

ఆ ఇద్దరూ ఒకసారి కలుసుకున్నట్టు కూడా ఒక కథ ఉంది. తరచు రేడియోలోనూ, నృత్య, సంగీత సదస్సులలోనూ 'అదిగో! అల్లదిగో', 'విన్నపాలు వినవలె' వంటి అన్నమాచార్యుల కీర్తనలు మీరు వింటూనే ఉన్నారు గదా! ఆయన కీర్తన లెంత మధురమైనవో మీకు నేను వివరంగా చెప్ప నక్కర లేదు.

''ఎవరు వ్రాసిందీ తెలియకుండానే తర తరాలుగా మన తెలుగు తల్లులు తమ పిల్లలకు పాడుతూ వచ్చిన 'జో అచ్యుతానంద! జో జో! ముకుందా!' అనే జోల పాట తాళ్లపాక అన్నమాచార్యులు వ్రాసిందే అని ఇటీవల తెలిసింది. ఆయన వ్రాసిన ఆధ్యాత్మిక సంకీర్తనలలో నుంచి మచ్చుకి ఒక్క కీర్తన మీకు వినిపిస్తాను:

రాగం: భూపాళం

పల్లవి: మేదిని జీవులం గావ మేలుకోవయ్యా
నీ దయ మాకెల్ల రక్ష విభ్రద మేలుకోవయ్యా!

చరణం: తగు గోపికల కన్ను దామరలు వికసించె
మిగుల సూర్య నేత్రుండ! మేలుకోవయ్యా!
తెగువ రాక్షసు లనే తమిరము విరియంగ
నెగడిన పరంజ్యోతి! విభ్రద మేలుకోవయ్యా॥

ఘన దురితపు నల్లగలువలు వికసించె
మినుకు శశి వర్ణుండ! మేలుకోవయ్యా!
పనివడి వేదా లనే పక్షు లెల్లం బలుకంగా
జనక! యాశ్రిత పారిజాత! మేలుకోవయ్యా॥

వరలక్ష్మి కుచ చక్రవాకము లొందొంటి రాయ
మెరయు దోషా రహిత ! మేలుకోవయ్యా !
పోరశి నీవు నిత్య భోగములు భోగించ
నిరతి శ్రీ వేంకటేశ ! నేడు మేలుకోవయ్యా !

ఈ యుగంలో ఇంకా మడికి సింగన, దుగ్గన, దూబగుంట నారాయణ కవి, భైరవరాజు వెంకటనాథుడు, పిడపర్తి సోమన, వెన్నెలకంటి అన్నయ వంటి కవు లెందరో పుట్టారు. వారందరూ వారి వారి ప్రత్యేక ధోరణులలో తెలుగు కవితా సరస్వతికి కొత్త కొత్త ఆభరణాలు అలంకరించా లని యత్నించారు. నిజానికి వాళ్లను గురించి మాత్రం తెలుసుకుంటే చాలదు. వాళ్లు వ్రాసిన రచనలు చదవాలి. తెలుగు మీద మీకు నిజంగా అభిమానం ఉంటే, ఏ నాటికైనా మీరు ప్రాచీన కాలంలో వచ్చిన తెలుగు కావ్యా లన్నీ స్వయంగా చదివి ఆనందించాలి !"

చీకటి పడిపోయిం దని కోటయ్య తొందర చేశాడు. అంతా హడావిడిగా కోటయ్య చూపుతున్న టార్చిలైట్ వెలుగులో మెట్లు దిగడం మొదలుపెట్టారు.



4

# భువన విజయం

ఆ మరునటి రోజు "నూజివీడు రోడ్డుమీద ఊరికి దగ్గిరగా ఉన్న మామిడి తోటకు ఇవాళ షికారుగా నడిచి వెళదాం!" అన్నాడు దయానిధి.

''ప్రబంధాలను గురించి మాకు ఇవాళ వివరంగా చెప్పాలి తాతయ్యా! పెందరాడే బయలు దేరుదాం!'' అంది అమల.

ఆ పనీ, ఈ పనీ చూసుకుంటూ తాతయ్య తాత్సారం చేస్తూంటే ఆయన కాళ్ళ క్రింద ఎసర్లు పోసి ఎలాగైతేనేం-ఇంకా ఎండ బాగా తగ్గకుండానే - 5 గంటలకే-పిల్లలు ఆయనను బయలుదేర దీశారు. అవసరమైన సరంజామా అంతా తీసుకుని కోటయ్య కూడా వాళ్ళ వెంట వెళ్లాడు.

తోటలో అంతా స్తిమితంగా సర్దుకుని కూచోగానే కమల తాతయ్యను నిగ్గదీసింది: ''అసలు ప్రబంధం అంటే ఏమిటి తాతయ్యా?'' అని.

రెండు నిమిషాల పాటు తీవ్రంగా ఆలోచించి తాతయ్య చెప్పడం మొదలుపెట్టాడు: ''నన్నయ్య దగ్గిరనుంచి శ్రీనాథ

పోతనల దాకా వచ్చిన తెలుగు కవిత్వం ఎక్కువ భాగం సంస్కృతం నుంచి అనువాదాలే। ఆ కవులు కూడా రాజుల ప్రేరణతోనే కావ్యాలు వ్రాసినా, కేవలం శబ్దార్థ చమత్కారాలతో ఆ రాజులను వినోద పరచడం కోసం వారు ఆ కావ్యాలను వ్రాయలేదు. ప్రజల కోసం, ధర్మానురక్తినీ, భక్తి భావాన్నీ, నీతి వర్తననీ ప్రజలలో కలిగించడం కోసం వారు ముఖ్యంగా రచనలు చేశారు.

"అయితే 16 వ శతాబ్దంలో తెలుగు కవిత్వం ఒక కొత్త మలుపు తిరిగింది. సంస్కృతంలో స్వల్పంగా ఉన్న మూలాన్ని తమ భావనా బలంతోనూ, కల్పనా శక్తితోనూ విస్తరించి, శబ్దార్థ చమత్కారాలతో తమ కృతిపతులను ఆహ్లాదపరుస్తూ కవులు కావ్యాలు వ్రాయడం మొదలుపెట్టారు. ఈ క్రొత్త రకం కావ్య ప్రక్రియకు ఆధునిక విమర్శకులు పెట్టిన పేరే 'ప్రబంధం'."

అమల అడిగింది: "అయితే పెద్దన మొదలైన ప్రబంధ కవులు తమ కావ్యాలను ప్రబంధాలని చెప్పుకోలేదా?"

"లేదమ్మా! ఆ రోజులలో 'ప్రబంధం' అనే మాటకు ఈ అర్థం ఉండేది కాదు. ప్రతి కావ్యాన్నీ ప్రబంధం అనే అనేవారు. తిక్కనగారు తాను తెనిగించిన భారత పర్వాలన్నిటినీ 'ప్రబంధ మండలి' అన్నారు. 'కవిత్రయం'లో

ఒకడైన ఎఱ్ఱన 'ప్రబంధ పరమేశ్వరుడు' అనే బిరుదు పొందాడు.



అల్లసాని పెద్దన
(*1520* ప్రాంతం)

''మొట్టమొదటి ప్రబంధం వ్రాసింది ఎవరు తాతయ్యా?'' ఆసక్తిగా అడిగింది కమల.

''అల్లసాని పెద్దనమ్మా! అందుకనే కృష్ణదేవరాయలు ఆయనను 'ఆంధ్ర కవితా పితామహా!' అని పిలిచేవాడు.

''తెలుగు కవులలో పెద్దన అంతగా ప్రభువుల చేత గౌరవం పొందిన కవి మరొకడు కనిపించడు. కృష్ణదేవరాయలవల్ల ఆయన పొందిన గౌరవాలు ఇన్నీ, అన్నీ కాదు. కృష్ణదేవరాయలు నిర్యాణం చెందినప్పుడు పెద్దన గారు చెప్పిన చాటువులో ఆయన ఎలా వాపోతాడో వినండి:

సీ. ఎదురైనచో తన మద కరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించు కొనియె
కోకట గ్రామాద్యనే కాగ్రహారంబు
లడిగిన సీమల యందు నిచ్చె
మనుచరిత్రం బందుకొను వేళ బుర మేగ
పల్లకి తన కేల బట్టి యెత్తె
బిరుదైన కవి గండపెండేరమున కీవె
తగుదంచు తానె పాదమున దొడిగె

గీ. 'ఆంధ్ర కవితా పితామహ! అల్లసాని
పెద్దన కవీంద్ర!' యని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు!"

ఆ పద్యం వినగానే అమలకు ఒక సందేహం వచ్చింది. "కవులు రాజులను ఆశ్రయించుకుని బ్రదికే సామాన్యులు గదా! కృష్ణరాయలంత మహాప్రభువు పెద్దన ఎక్కిన పల్లకీ మోయడం, ఆయన కాలు పట్టుకొని గండ పెండేరం (బిరుదు కడియం) తొడగడం- ఇవన్నీ నిజమే నంటావా తాతయ్యా? లేకపోతే ఇందులో కొంత అతిశయోక్తి ఉందా?" అంది.

అలాంటి ప్రశ్న అడిగినందుకు దయానిధి అమలను మెచ్చుకుంటూ ఇలా అన్నాడు: "నిజమే తల్లీ! ఈ రోజులలో కవుల పరిస్థితిని చూస్తున్న నీకు అలాంటి సందేహం రావడం సహజమే! కాని ఆ రోజులు వేరు; ప్రభువులు

స్వయంగా పండితులు, రసజ్ఞులు. తమ కొలువులో ఉన్న కవులను వారు తమ ఆశ్రితు లని హీనంగా చూసేవారు కాదు. వారు తమ కొలువులో ఉండడం తమకు ఘనత అనుకునే వారు. ఈ పద్యంలో పెద్దనగారు చెప్పిన మాటలు అక్ష రాలా నిజం।

''పెద్దనకు రాయలు గండపెండేరం తొడగడం-అది ఒక రసవంతమైన కథ। 'భువన విజయం' సభలో ఒక రోజున రాయలు పళ్లెరంలో గండపెండేరం తెప్పించి 'అచ్చ తెలుగులోనూ, సంస్కృతంలోనూ సరిసమానంగా కవిత్వం చెప్పగల వారి కాలికి ఆ గండపెండేరం తొడుగుతా నని ప్రక టించాడు। అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఎవ్వరూ అందుకు సాహసించలేక పోయారు. అప్పుడు పెద్దనగారు లేచి ఆశువుగా 'పూత మెరుంగులున్ పసరు పూప బెడంగులు చూపునట్టివా కైతలు....' అంటూ ఎత్తుకుని 'త'కార ప్రాసతో 22 పాదాలతో ఒక అద్భుతమైన ఉత్పల మాలిక చెప్పారు. ఆ మాలికలో సగం వరకూ అన్నీ అచ్చ తెలుగు పదాలు; ఆ తరువాత చివరి వరకూ సంస్కృత సమా సాలు। ఆశువుగా చెప్పినా, కమ్మెచ్చున తీసినట్టు సాగిన ఆ ఉత్పలమాలిక ఇప్పటికీ ఉంది. మీరు పెద్ద అయిన తరువాత స్వయంగా దానిని చదువుకుని ఆనందించవచ్చును।

''పెద్దన ఆ మాలిక చెప్పగానే సభ అంతా హర్షధ్వా నాలతో మార్మోగిపోయింది. స్వయంగా కవీ, రసజ్ఞశేఖరుడూ

అయిన రాయలు ఆనందాశ్రువులతో పెద్దనను సమీపించి ఆయన కాలికి స్వయంగా గండపెండేరం తొడిగాడు."

"మరి ఆ పెద్దన కవిత్వంలో ఉన్న విశేషమేమిటో కాస్త వివరంగా చెప్పు తాతయ్యా!" అంది కమల. దయానిధి తిరిగి ఇలా కథ కొనసాగించాడు:

"అల్లసాని పెద్దన వ్రాసిన 'మనుచరిత్రే' తొలి తెలుగు ప్రబంధం. అంతకు ముందు వచ్చిన కవిత్వానికి నన్నయ ఒరవడి పెడితే, ఆటు తరువాత వచ్చిన కవిత్వానికి పెద్దన ఒరవడి పెట్టాడు. మొదటి నుంచీ తెలుగు కవిత్వంలో ఇతివృత్తం, పాత్రపోషణ, ఉదాత్త భావ ప్రకటన లాంటి విషయాలకంటె పద్యరచనలో నేర్పుకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. పెద్దనగారి చేతిలో తెలుగు పద్యం సర్వోత్కృష్టమైన రూపం పొందింది. శబ్దం, అర్థం సమస్కంధంగా నడుస్తూ పెద్దన పద్యం ఎక్కడా అతుకులు కనిపించకుండా కమ్మెచ్చున తీసిన ట్టుంటుంది. అందుకే పెద్దన కవిత్వంలో ప్రధాన లక్షణాలు 'జిగి', 'బిగి' అన్నారు."

"ఆ పద్యాలు మేము స్వయంగా చదువుకుని ఆనందించ గలిగితే తప్ప ఆ 'జిగి, బిగి' మా కర్థం కావు తాతయ్యా! ఇంతకూ ఆ కావ్యంలో కథ ఏమిటి?" అడిగింది విమల.

"ప్రబంధాలలో కథకు ఎక్కువ ప్రాధాన్యం ఉండదమ్మా! వర్ణనలకూ, చమత్కారమైన కల్పనలకూ, పద్యాలను చిత్ర చిత్రాలుగా నడిపించడానికే ఎక్కువ ప్రాధాన్యం.

మను చరిత్రకు మరో పేరు 'స్వారోచిష మను సంభవం'. అంటే స్వారోచిష డనే మనువు పుట్టుక.

''ప్రవరు డనే అందమైన ఒక బ్రాహ్మణుడు పాద లేపం సహాయంతో హిమవత్పర్వతానికి వెళ్ళి ఆ పాదలేపం కరిగి పోవడం మూలాన తిరిగి ఇల్లు చేరే మార్గం చెప్ప మని అక్కడ కనిపించిన వరూధిని అనే ఒక అప్సరసను అడుగు తాడు. ఆమె అతనిని ప్రేమిస్తుంది. ఆమె ప్రేమను నిరాక రించి, అగ్నిదేవుని సాయంతో ఆతడు ఇంటికి వెళ్లి పోతాడు. అంతకు ముందు వరూధినిని ప్రేమించి ఆమెచే తిరస్కరించ బడిన ఒక గంధర్వుడు ప్రవరుడి వేషంలో వచ్చి ఆమె కోరిక తీరుస్తాడు. వారికి 'స్వరోచి' పుడతాడు. తరువాత ఆ స్వరోచికే స్వారోచిష మనువు జన్మిస్తాడు. ఇదీ టూకీగా ఈ కావ్యంలో కథ.

''ఈ కావ్యంలో వరూధినీ ప్రవరుల ఘట్టమే చాలా ముఖ్యమైంది. వెనుక తెలుగులో పంచ కావ్యాలతో విద్యా భ్యాసం సాగే రోజులలో దానిలోని కొన్ని పద్యాలైనా ప్రతి తెలుగు విద్యార్థికీ నోటికి వచ్చి ఉండేవి.

''తెలుగు పంచ కావ్యాలలో మనుచరిత్ర మొదటిదా తాతయ్యా? మరి తక్కిన నాలుగూ ఏవి?'' తొందర ఆపుకోలేక అడిగింది అమల.

''అలా తొందర పడతావేం తల్లీ! వరుసగా వస్తాయి విను!''

"ప్రబంధ కవిత్వానికి పట్టుకొమ్మ హంపీ విజయనగరంలోని కృష్ణదేవ రాయని ఆస్థానం. మొట్టమొదటి సారిగా వింధ్యకు దక్షిణాన కన్యాకుమారి దాకా తెలుగు సామ్రాజ్యాన్ని విస్తరింపజేసి అశేష వైభవాలతో తులతూగిన సార్వభౌముడు కృష్ణదేవ రాయలు. సమరాంగణంలో ఆయన ఎంత ప్రసిద్ధుడో, సాహిత్య రంగంలోనూ అంత అందెవేసిన చేయి! యుద్ధాలలో నిమగ్నుడు కాని సమయంలో ఆయన కవిత్వం, సంగీతం వంటి లలిత కళలతో వినోదించేవాడు. అందుకోసం ప్రత్యేకంగా 'భువన విజయం' అనే భవనం కట్టించాడు. భోజరాజు ఆస్థానంలో నవ రత్నాలు ఉన్నట్టు ఆయన ఆస్థానంలో 'అష్ట దిగ్గజా'లని ఎనిమిది మంది కవులు ఉండేవారు. అందుకే ఆయనను 'ఆంధ్ర భోజుడు' అంటారు.

"కృష్ణదేవ రాయలు తెలుగు కవులనే కాదు; సంస్కృతం, కన్నడం, తమిళం మొదలైన ఇతర భాషా కవులను కూడా ఆదరించాడు. ఆయన ఆస్థానంలో అన్ని భారతీయ భాషలూ వినిపిస్తూ ఉండే వట! అన్ని భాషలూ విని, ఆ భాష లన్నిటి లోకీ తెలుగు లెస్స - మధురమైంది - అని ఆయన సర్టిఫికెట్ ఇచ్చాడు:

గీ. తెలుగదేల యన్న దేశంబు తెలు; గేను
తెలుగు వల్లభుండ; తెలుగొ? కండ!
ఎల్ల నృపుల గూడి ఎరుగవే బాసాడి?
దేశ భాషలందు తెలుగు లెస్స!

ఈ పద్యం కృష్ణదేవ రాయలు వ్రాసిన ఆముక్త మాల్యదలోది. చిత్రం ఏమిటంటే రాజరాజ నరేంద్రుడు మొదలైన ప్రభువుల్లాగ కేవలం కవి పండిత పోషకుడుమాత్రమే కాదు శ్రీకృష్ణదేవ రాయలు; ఆయన స్వయంగా కవి, పండితుడు.



కృష్ణదేవ రాయలు (పరి. 1500-1530)

వైష్ణవ మతాభిమానంతో ఆయన గోదాదేవి కథను 'ఆముక్త మాల్యద'(పూలదండముందుగా ధరించి చూసి తరువాత ఆలయంలో స్వామికి అర్పిం

చేసి) అనే గొప్ప కావ్యం వ్రాశాడు. ఇది తెలుగులోని ప్రౌఢ ప్రబంధాలలో ఒకటి. అందుకే దీనిని పంచ కావ్యా లలో చిట్టచివరి అయిదో కావ్యంగా బోధించే వారు."

"తెలుగు పంచ కావ్యాలలో మనుచరిత్ర మొదటిదీ, ఆముక్తమాల్యద అయిదోదీ అన్నావు గదా! తక్కిన మూడూ ఏవి తాతయ్యా?" అని అడిగింది అమల.

"రెండోది: నంది తిమ్మన వ్రాసిన పారిజాతాప హరణం; మూడోది భట్టుమూర్తి వ్రాసిన వసుచరిత్ర; నాలు గోది: తెనాలి రామకృష్ణుడు వ్రాసిన పాండురంగ మాహా త్మ్యం. ఆ వరుసలో ఆ అయిదు కావ్యాలలోనూ కనీసం ఒకటి రెండు ఆశ్వాసాలైనా ప్రతి పదార్థ తాత్పర్యాలతోనూ, ఛందోలంకారాది విశేషాలతోనూ గురు ముఖతః నేర్చుకుంటే తెలుగు భాషలో ఏ కావ్యం అయినా స్వయంగా చదువుకుని ఆనందించే సాహిత్య జ్ఞానం అలవడుతుంది.

"ఆ కావ్యాలను గురించి చెప్పడానికి ముందు రాయల ఆస్థానంలోని అష్ట దిగ్గజాలు ఎవరో చెప్పవా తాతయ్యా?" అడిగింది గోముగా కమల.

"సంప్రదాయ సిద్ధంగా వస్తూన్న తెనాలి రామలింగని కథల వంటి వాటిలో వినిపించే అష్టదిగ్గజాలు: 1. పెద్దన, 2. తిమ్మన, 3. మాదయగారి మల్లన, 4. అయ్యలరాజు రామభద్రుడు, 5. ధూర్జటి, 6. భట్టుమూర్తి, 7. పింగళి సూరన, 8. తెనాలి రామకృష్ణుడు.

"అయితే వీరిలో చివరి నలుగురూ తమ కృతులను కృష్ణదేవరాయలకు గాక ఇతరులకు అంకితం ఇచ్చారు. అందుచేత వారు కృష్ణదేవరాయల సమకాలికులు కారనీ, కొద్దిగా తరువాతి వారనీ చారిత్రకులు అంటున్నారు. చింతలపూడి ఎల్లనార్యుణ్ణీ, కందుకూరి రుద్రకవినీ అష్టదిగ్గజాలలో కొందరు చేరుస్తున్నారు. మరి కొందరు తెలుగు కవులే కాక అష్టదిగ్గజాలలో అన్య భాషా కవులు కూడా ఉండి ఉండవచ్చు నని ఊహిస్తున్నారు. ఇలా చరిత్ర పరిశోధకులలో ఈ విషయమై ఏకాభిప్రాయం లేదు."

"పెద్దన పద్యం చాలా అందంగా ఉంటుం దని మమ్మల్ని ఊరించావు. ఆయన మనుచరిత్రలో నుంచి ఒక్క పద్యం మాకు వినిపించవూ తాతయ్యా!" అని అడిగింది అమల.

ప్రాచీన కవిత్వం వినా లన్న అమల కుతూహలాన్ని మెచ్చుకుంటూ తాతయ్య ఈ క్రింది పద్యం చదివాడు :

**కం. మృగమద సౌరభ విభవ**
**ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ**
**స్థగితేతర పరిమళమై**
**మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్!"**

"వరూధిని వేసుకున్న తాంబూలం పరిమళంతో ఒక మారుతం - చిరుగాలి - వీచిందట! ఈ పద్యంలో చివరి పాదం నడక ఆగి ఆగి వీచే ఆ పిల్లగాలి అందమైన నడకను స్ఫురింప జేయడం లేదూ?

''అర్థం తెలియక పోయినా అక్షరాల కూర్పు ఎంత మధురంగా ఉందో? ఈ పద్యం మాకు వ్రాసి ఇయ్యి తాతయ్యా! మేము దీన్ని కూడా కంఠస్థం చేస్తాము'' అంది అమల.

''అలాగేలే-ఇక, కృష్ణదేవరాయల కవితా శైలి చాలా కష్టమైందే అయినా ఆయన చేసిన తెలుగు ఋతువుల వర్ణనలూ, ఆ నాటి సంఘజీవన దృశ్యాల యథార్థ వర్ణనలూ కష్టపడి అయినా తెలుగు వారందరూ విధిగా చదివి తీరవలసినవి. ఆముక్తమాల్యదలో ప్రధానకథ గోదాదేవి (అండాళ్) రంగనాథుణ్ణి వివాహమై ఆయనలో ఐక్యమైపోవడం! అయితే దానిలో యామునాచార్యుల చరిత్ర, ఖాండిక్య కేశిధ్వజుల వేదాంత చర్చ, మాలదాసరి కథ వంటి ఉపాఖ్యానాలను కూడా చేర్చి వాటిని ఎంతో ప్రౌఢంగా రచించాడు కృష్ణదేవరాయలు.

''పెద్దన మనుచరిత్ర తరువాత ఈ యుగంలో ఎక్కువ ప్రసిద్ధిలోకి వచ్చిన ప్రబంధం నంది తిమ్మన పారిజాతాపహరణం. నారదుడు తెచ్చిన పారిజాత పుష్పం రుక్మిణికిచ్చినందుకు సత్యభామ అలగడం, ఆమె అలుక తీర్చడం కోసం శ్రీకృష్ణుడు సత్యతో సహా గరుడ వాహనం ఎక్కి వెళ్ళి స్వర్గం మీద దాడిచేసి అక్కణ్ణించి పారిజాతపు మొక్కను తెచ్చి సత్యభామ పెరటిలో నాటడం ఈ ప్రబంధంలోని ప్రధాన కథ. నాయిక ముక్కును వర్ణిస్తూ తిమ్మన చెప్పిన ఒక పద్యం మిక్కిలి ప్రచారం పొందడంతో ఆయనకు 'ముక్కు' తిమ్మన అనే పేరు ప్రసిద్ధిలోకి వచ్చింది.

''అంతగా ప్రచారమైన ఆ పద్యం మాకు నేర్పించు తాతయ్యా!'' అని అడిగింది కమల.


నంది తిమ్మన
(1520 ప్రాంతం)

ఆ పద్యం చదివి వినిపించడానికి ముందు ఆ పద్యాన్ని గురించి ప్రచారంలో ఉన్న ఒక కథను దయానిధి వారికి చెప్పాడు.

''ఈ పద్యం ఒక తాళపత్రం మీద వ్రాసి తిమ్మనగారు తమ ఇంటి మంగలికి బహూకరించి, 'దీనిని అమ్ముకో నీకు విశేషంగా ధనం

లభించగలమ' అన్నారట. నాలుగు వేల నరహాలిచ్చి భట్టుమూర్తి ఆ పద్యాన్ని కొనుక్కొని తన వసుచరిత్రలో వాడుకున్నాడట."

తరువాత దయానిధి ఆ పద్యం చదివి వాళ్ళకు అర్థం అయేట్టు దాంట్లో చమత్కారం వివరించాడు :

**శా. నానా సూన వితాన వాసనల నానందించు సారంగ మే**
**లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్ కాకన్ తపంబంది యో**
**షా నాసాకృతి తాల్చి సర్వ సుమన స్సౌరభ్య సంవాసియై**
**పూనెన్ ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్ !**

"సంపెంగ పువ్వుమీద తుమ్మెదలు వాలవు. అందుకోసం సంపెంగపువ్వు ఘోరమైన తపస్సుచేసి అన్ని పూవుల పరిమళాలతోనూ కూడిన నాయిక నాసిక (ముక్కు) గా రూపొందిందట! తన తపస్సు ఫలించి నాయిక చూపులు అనే తుమ్మెద బారులను తనకు రెండు వైపులా నిలబెట్టుకుందిట!

"అష్టదిగ్గజాలలో మూడవ వాడు మాదయగారి మల్లన. ఈయన వ్రాసిన ప్రబంధం 'రాజశేఖర చరిత్ర'. దీనిలోని కథ చిత్రమైంది. 'అవంచిక'పురం రాజు హేమధన్వుడు. ఈశ్వరుని అనుగ్రహం వలన అతనికి కలిగిన కుమారుడు రాజశేఖరుడు. జటిల కౌశికుడనే ముని కుమార్తెను ఒక రాక్షసుడు ఎత్తుకుపోగా రాజశేఖరుడు దండెత్తిపోయి ఆ రాక్షసుణ్ణి సంహరిస్తాడు. కాంతిమతీదేవిని వివాహమాడుతాడు. ఇదీ సంగ్రహంగా ఈ ప్రబంధంలోని కథ. నిజానికి మనుచరిత్ర, పారిజాతాపహరణ కావ్యాలలో కంటె ఈ కావ్యంలో కథా

కథన కౌశలం, పాత్రపోషణ, తెలుగు నుడికారం విశిష్టంగా సాగినా, ఏ కారణంవల్లనో గాని ఆ రెండు కావ్యాలతో సమానంగా ఈ కావ్యం ప్రసిద్ధి పొందలేదు.

"అయ్యలరాజు రామభద్రుడు వ్రాసిన ప్రబంధం 'రామాభ్యుదయం'. రామాయణ కథనే సంగ్రహించి ప్రబంధ శైలిలో అలంకార ప్రధానంగా తిరిగి చెప్పడంలో ఈయన విశిష్ట ప్రతిభ మనకు కనిపిస్తుంది. శ్లేష, యమకం వంటి పలు అలంకారాలకు ఈ ప్రబంధంలో చక్కని ఉదాహరణలు లభిస్తాయి.

"ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరుని భక్తుడు. తన ఇలవేల్పు అయిన ఆ శ్రీ కాళహస్తీశ్వరుని మీద 'శ్రీకాళహస్తీశ్వర శతకం' అనే ఒక శతకం, 'శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం' అనే ఒక ప్రబంధం ఆయన వ్రాశాడు. తెలుగులో యథా వాక్కుల అన్నమయ్య 'సర్వేశ్వర శతకం', పాల్కురికి సోమనాథుని 'వృషాధిప శతకం'తో పాటు మిక్కిలి ప్రసిద్ధి పొందిన ప్రాచీన శతకాల్లో ఇది ఒకటి. "అంతా మిథ్య తలంచి చూచిన...." లాంటి ఈ శతకంలోని ఎన్నో పద్యాలు- ప్రజల నోళ్లలో విశేషంగా నానినవి- ఉన్నాయి."

"ఆ శతకంలో నుంచి కూడా ఒక్క పద్యం వినిపించు తాతయ్యా! మాకు ఎంతవరకూ అర్థం అవుతుందో చూద్దాం!" అంది విమల.

"ఆ శతకంలో ఉన్న భక్తీ, వేదాంతం మీకు ఈ వయస్సులో అంతగా అర్థంకావు. అయినా ఆసక్తిగా అడుగుతున్నావు గనుక బాగా ప్రచారంలో ఉన్న ఒక్క పద్యం వినిపిస్తాను :

శా. అంతా మిథ్య తలంచి చూచిన; నరుం డట్లౌ టెఱింగిన్ సదా
  కాంతల్ పుత్త్రులు నర్థమున్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
  భ్రాంతిం జెంది చరించు గాని పరమార్థంబైన నీయందు తా
  చింతా కంతయు చింత నిల్పడు గదా! శ్రీకాళహస్తీశ్వరా!

"'అంతా', 'ఎరింగిన్' లాంటి వ్యావహారిక రూపాలను నిస్సంకోచంగా ఆ నాటి కవిత్వభాషలో వాడిన పరమ స్వతంత్రుడు ధూర్జటి కవి।

"ఒక సాలెపురుగు (శ్రీ), ఒక పాము (కాళము), ఒక ఏనుగు (హస్తి), 'తిన్నడు' అనే ఒక మూఢ భక్తుడూ శ్రీ కాళహస్తిలోని ఈశ్వరుణ్ణి ఆరాధించి ముక్తి పొందిన చిత్రమైన కథలను అతి మధురంగా ఈ కావ్యంలో ధూర్జటి చెప్పాడు. ధూర్జటి పలుకుల మాధురీ మహిమను గూర్చి ఒక చాటు కథ ఉంది.

"కొలువు దీర్చి ఉన్న కృష్ణదేవరాయలు ఒకనాడు -

చం. స్తుతమతి యైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకెట్లు కల్గె నీ
  అతులిత మాధురీ మహిమ?"

"అని సభాసదులను ప్రశ్నించాడట. వెంటనే కొంటె కోణంగి అయిన తెనాలి రామలింగడు లేచి ఆ ప్రశ్నకు జవాబు చెబుతూ ఆ పద్యాన్ని ఇలా పూరించాడట:

......................హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వార వనితా జనతా ఘన తాపహారి సం
తత మధురాధ రోదిత సుధారస ధారల గ్రోలుటం జుమీ!



రామరాజ భూషణుడు
(1520 ప్రాంతం)

"ధూర్జటి పలుకులు అంత మధురంగా ఉండడానికి కారణం నిరంతరం ఆయన వారవనితల అధర రసాస్వాదన చేయడం - అని దీని అర్థం. ధూర్జటి యౌవనంలో మంచి విలాస పురుషుడు అని సూచించే ఈ కథ నిజమో, అబద్ధమో నిరూపించేందుకు ఆ కవి జీవిత విశేషాలు మనకు ఎక్కువగా లభించలేదు.

"మనుచరిత్రతో పాటు ఆ తరువాత వచ్చిన ప్రబంధాల మీద ఎక్కువ ప్రభావం చూపించిన మరో గొప్ప ప్రబంధం 'వసు చరిత్ర'. ఆ తరువాతి కాలంలో ఈ రెండు ప్రబంధాలనూ అనుకరిస్తూ 'పిల్ల మను చరిత్ర'లూ, 'పిల్ల

వసుచరిత్ర'లూ కోకొల్లలుగా వచ్చాయి. కోలాహలుడనే పర్వతరాజు శుక్తిమతి అనే నదీ కన్యను బలాత్కరించడం, వారి సంగమం ఫలితంగా గిరిక అనే పుత్రిక, వసుపదుడు అనే పుత్రుడూ జన్మించడం, తరువాత ఒక రోజున వసు మహారాజు వేటకు వెళ్ళి అనుకోకుండా గిరికను కలుసుకుని ఆమెను ప్రేమించడం, అనంతరం ఇంద్రుడు మొదలైన పెద్దలు మధ్యవర్తిత్వం వహించి గిరికా, వసు మహారాజుల కళ్యాణం జరిపించడం ఈ ప్రబంధంలోని ప్రధాన కథ. శుక్తిమతీ కోలాహలుల కథను సహజమైన, అప్రయత్న సిద్ధమైన శ్లేషలతో రామరాజ భూషణుడు (భట్టుమూర్తి) మనోహరంగా చిత్రించాడు. భట్టుమూర్తి సంస్కృతాంధ్రాలలో మాత్రమే గొప్ప విద్వాంసుడు కాదు. సంగీతంలో కూడా నిధి! ఆయన పద్యాలు వీణమీద వాయించ వచ్చు. ఆయన అక్షరాల కూర్పూ, పద్యాల నడకా అంత సంగీతానుకూలంగా సాగాయి."

దయానిధి ఆసక్తి జనకంగా తెలుగు కవిత కథను చెబుతూ ఉంటే మధ్యలో చిన్న చిన్న సందేహాలు రేకెత్తినా, రసవంతమైన ఆయన ధోరణిని అడ్డగించడం ఇష్టంలేక నిశ్శబ్దంగా ఊపిరి కూడా బిగబట్టి ఆలకిస్తున్నారు పిల్లలు.

"తరువాత చెప్పుకోవలసినవాడు తెలుగులో పద్యరూపమైన తొలి నవల వ్రాసిన పింగళి సూరన. ఆయన వ్రాసిన కళాపూర్ణోదయం కథ మధ్యలో అవాంతర కథలు వస్తూ ఎప్పటికప్పుడు పాఠకుల కథా శ్రవణ కుతూహలాన్ని పెంపొందిస్తూ అత్యాసక్తిజనకంగా సాగిన తొలి తెలుగు నవల

అనవచ్చును. సరస్వతీ బ్రహ్మల ప్రణయ కలాపంతో ఆరంభ మయ్యే ఈ కావ్యంలో కలభాషిణీ మణికంధరుల కథ, సుముఖాసత్తి మణిస్తంభుల కథ, సుగాత్రీ శాలీనుల కథ, కళాపూర్ణుని దిగ్విజయ యాత్ర కథ-ఇలా దేని కదే అత్యద్భుత మైన స్మృతులను రేపుతుంది. కథా కథనంలో, పాత్ర పోషణలో, సంభాషణల నిర్వాహణలో సూరన అందె వేసిన చేయి. ఆంగ్ల కవి షేక్స్‌పియర్‌కి సమకాలికుడు సూరన. షేక్స్‌పియర్ వ్రాసిన 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'లో కవల పిల్లలను ఒకరిని చూసి ఒకరని తబ్బిబ్బుపడే ఒక దృశ్యం కల్పించి నట్టే, సూరన కూడా దీనిలో మాయా రంభ, నిజ రంభల సంవాదం కూర్చాడు. వాళ్ల మాటలను బట్టి వాళ్ళలో ఎవరు నిజమైన రంభో తెల్సుకోలేక పాఠకులు కూడా తబ్బిబ్బు పడతారు. ఏమైనా కళాపూర్ణోదయ కథ చదివి ఆనందించని వారికి ఆ ఆనందం ఇలాంటిది అని వర్ణించి చెప్పడం సాధ్యం కాదు.

"పింగళి సూరన వ్రాసిన మరో కావ్యం 'ప్రభావతీ ప్రద్యుమ్నం'. కలలో శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుణ్ణి ఒక చిత్ర పటంలో చూసి ప్రేమించిన రాక్షస కన్య ప్రభావతిని అడ్డంకు లన్నిటినీ అధిగమించి ప్రద్యుమ్నుడు వెళ్లి వివాహ మాడే కథను నాటకీయంగా మనోహరంగా చిత్రించాడు సూరన ఈ కావ్యంలో. ప్రభావతీ ప్రద్యుమ్నుల మధ్య శుచిముఖి అనే హంస నిర్వహించిన రాయబారం ఈ కావ్యంలో మంచి రసవద్ ఘట్టం!

"పింగళి సూరన 'రాఘవ పాండవీయం' అనే ఒక ద్వ్యర్థి కావ్యం కూడా వ్రాశాడు. అలాంటి కావ్యాలకు తెలుగులో అదే మొదలు!"

"ద్వ్యర్థి కావ్యం అంటే ఏమిటి తాతయ్యా?" అని అడిగింది అమాయికంగా కమల.

"'ద్వ్యర్థి' అంటే రెండర్థాలు గల కావ్యం అని. 'రాఘవ పాండవీయం' అనే ఒకే కావ్యంలో రామాయణ కథనీ, భారత కథనీ కూడా ఆయన చెప్పాడు. ఒక విధంగా మాటలను విరుచుకుని అర్థం చేసుకుంటే రామాయణ కథా, మరో విధంగా విరిచి చదువుకుంటే భారత కథా కనిపిస్తాయి. ఇలా ప్రతి పద్యంలోనూ రెండర్థాలు స్ఫురించేట్టు వ్రాయడం చాలా కష్టం. ఈయనను చూసి భట్టుమూర్తి 'హరిశ్చంద్ర నలోపాఖ్యానం' అని హరిశ్చంద్రుని కథనూ, నలుని కథనూ జోడించి ఒక ద్వ్యర్థి కావ్యం వ్రాశాడు."

"ఒకే పద్యం నుంచి రెండర్థాలు ఎలా వస్తాయో చిత్రంగా ఉంది. రాఘవ పాండవీయం నుంచి ఒక చిన్న పద్యం మాకు వినిపించవూ తాతయ్యా!" అని అడిగింది అమల.

ఆమె కుతూహలాన్ని మెచ్చుకుంటూ దయానిధి ఈ పద్యం చదివాడు :

గీ. ఎందు వేట రారె ఇతరు లే మనసుతో
దార సంగ సుఖము దప్ప ద్రోచి

తకట ! పాండురాజ యశ మెన్నపైతివి
క్రూర దశరథేశ ! కుఃము రోయ" (ఆ. 1 - ప 31)

రామాయణార్థంలో శ్రవణ కుమారుణ్ణి వధించిన దశరథునితో వృద్ధుడైన మునికుమారుని తండ్రి అనే మాటలు ఇవి. భారతార్థంలో పాండురాజు కూటమిలో ఉన్న లేడిపై బాణము విడువగా ఆ లేడి అనే మాటలు. రామాయణార్థంలో 'ఇతరులు + ఏమన + సుతోద్ధార సంగ సుఖము' అనీ, 'పాండుర + అజ + యశము' అనీ, 'క్రూర ! దశరథేశ !' అనీ విరుచుకోవాలి. భారతార్థంలో - 'ఇతరులు + ఏ మనసుతో + దార సంగ సుఖము' అనీ, 'పాండురాజ ! యశమెన్న పైతివి ?' అనీ, క్రూరదశ + రథేశ (రథిక శ్రేష్ఠుడా !)' అనీ విరిచి చదువుకుంటే రెండర్థాలూ విడి విడిగా స్ఫురిస్తాయి.

"అష్ట దిగ్గజ కవులలో ఇక తెనాలి రామలింగడు ఒక్కడు మిగిలి ఉన్నాడు. ఆయనను గురించి మీ రెన్నో కథలు వినే ఉంటారు. ఇవాళ ప్రొద్దు క్రుంకిపోతూంది. కనుక ఆయనను గురించి టూకీగా చెబుతాను. ఆయన వికట కవి మాత్రమే కాదు. వాస్తవిక దృష్టి గల గొప్ప ప్రౌఢ కవి. ఆయన వ్రాసిన 'పాండురంగ మాహాత్మ్యం' మంచి అర్థ పుష్టి గల కావ్యం. ఆ ప్రబంధంలో నిగమశర్మ అనే బ్రాహ్మణుడి కథను ఆయన బహు రసవంతంగా వ్రాశాడు. ఆయన శైలి ప్రౌఢం అయినా, పెద్దయాక గురుముఖతః మీరు ఆ కావ్యం చదవాలి. ఆ కావ్యంలో తెనాలి రామకృష్ణ కవి చేసిన శబ్ద చమత్కారాలూ, అర్థ చమత్కారాలూ

అర్థం చేసుకుని ఆనందించాలి. ఆ నాటి తెలుగు సాంఘిక జీవితానికి ఆ కావ్యం ఎలా దర్పణం పడుతూందో గుర్తించాలి. ఆ మహాకవి చిత్రించిన నిగమశర్మ అక్క పాత్రతో ఆ నాటి మన తెలుగు ఆడబడుచును సందర్శించాలి."

"పెద్దయాక అలాగే చదువుకుంటాం లే గాని తాతయ్యా! ఆయన శైలి ఎలా ఉంటుందో చూడడానికి మచ్చుకి ఒక్క పద్యం ఇప్పుడు మాకు చదివి వినిపించు!" అని అడిగింది కమల.

"తెనాలి రామకృష్ణుని కవిత్వం ప్రౌఢమైనదమ్మా! మాటలు అర్థం అయినా భావం అంత సులభంగా బోధపడదు. అయినా నువ్వన్నట్టు మచ్చుకి ఒక్కటంటే ఒక్కటే పద్యం చదివి వినిపిస్తాను:



తెనాలి రామకృష్ణుడు
(1520 ప్రాంతం)

శా. గంగా సంగమ మిచ్ఛగించునె మదిన్? కావేరి దేవేరిగా
అంగీకార మొనర్చునే? యమునతో సాంగత్యముం జేయునే?
రంగ త్తుంగ తరంగ హస్తముల ఆ రత్నాకరేంద్రుండు నీ
అంగం బంటి సుఖించె నేని గుణభద్రా! తుంగభద్రా నదీ!

"ఈ అష్టదిగ్గజాల సరసను పీఠం వేయదగ్గ కవులు మరి ఇద్దరు ముగ్గు రున్నారు. వారిలో ఒకడు చింతలపూడి ఎల్లనార్యుడు. అతని 'రాధా మాధవం' ప్రజలను ఎంతగా ఆకర్షించిం దంటే వారు అతని అసలు పేరు మరచిపోయి అతణ్ణి 'రాధామాధవ కవి' అనడం మొదలుపెట్టారు.

"మరొకడు కందుకూరి రుద్రయ్య. ఇతని నిరంకుశో పాఖ్యానం, 'సుగ్రీవ విజయ' యక్షగానం విశేష ప్రశస్తి పొందాయి.

"మరో ఉద్దండ కవి సంకుసాల నృసింహకవి. ఈయన వ్రాసిన కావ్యం 'కవికర్ణ రసాయనం' అనబడే మాంధాతృ చరిత్ర. ఈ కావ్యంలో తాను పోషించిన శృంగారం ఎంతటి యతినైనా విటుణ్ణి చేస్తుం దనీ, అలాగే తాను వర్ణించిన వైరాగ్యం ఎంతటి విటుణ్ణైనా యతిగా మారుస్తుం దనీ ఈయన సగర్వంగా చెప్పుకున్నాడు. 'ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమె?' అనే పాదంతో ముగిసే ఈయన వ్రాసిన ఒక ప్రసిద్ధ పద్యాన్ని కృష్ణరాయల కూతురు మోహనాంగి 5000 దీనారాలు ఇచ్చి కొనుక్కొన్న దని ఒక ఐతిహ్యం!

"కృష్ణరాయల కాలంలో జీవించి, ఆయన ఆస్థానం సందర్శించి, ఆయన చేత సమ్మానాలందుకొన్న తొలి



మొల్ల (1520 ప్రాంతం)

తెలుగు కవయిత్రి 'మొల్ల'. సరళ సుందరంగా ఆమె వ్రాసిన 'మొల్ల రామాయణం'లోని పద్యాలు ఇతర రామాయణాల లోని పద్యాల కంటె ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి."

మసిమసి చీకటి పడుతూంది. కోటయ్య సరంజామా సర్దడం మొదలుపెట్టాడు. "ఏమైనా సరే! ఈ యుగం తెలుగు కవిత పూర్తి అయితే గాని మేము కదలం!" అని మొరాయించుకు కూచున్నారు పిల్లలు.

దయానిధి నవ్వుతూ 'అలాగే లెండర్రా!' అంటూ ప్రబంధ యుగ తెలుగు కవిత్వ చరిత్రకు ఇలా భరత వాక్యం పాడాడు :

"చివరికి వచ్చేశాం. 16 వ శతాబ్దం చివర జీవించిన మరి నలుగురు కవుల్ని గురించి చెప్పుకుంటే ఈ యుగం అయిపోతుంది. ఆ నలుగురు కవులు : సారంగు తమ్మయ, చదలవాడ మల్లయ, పొన్నిగంటి తెలగన్న, శంకరకవి.

"వీరిలో మొదటి ఇద్దరూ సుప్రసిద్ధ శ్రీవైష్ణవ భక్తుడైన విప్రనారాయణుని కథను 'వైజయంతీ విలాసం' అనే పేర ఒకరూ, 'విప్రనారాయణ చరిత్ర' అనే పేరుతో మరొకరూ కావ్యాలుగా వ్రాశారు. శైలిలో ప్రౌఢతకు స్వస్తి చెప్పి తరువాతి యుగంలో కనిపించే సరళ సుందరమైన శైలికి వీరే మొదట అంకురార్పణ చేశారని చెప్పవచ్చును.

"పొన్నిగంటి తెలగన్న అచ్చ తెలుగులో కావ్యాలు వ్రాయడం మొదలు పెట్టినవాడు. సంస్కృతం మాటలు రాకుండా అచ్చ తెలుగు పదాలతో కావ్యం వ్రాయడం చాలా కష్టం. అయినా ఈయన వ్రాసిన 'యయాతి చరిత్ర',

'అచ్చ తెలుగు రామాయణం' సరళంగానూ, సరసంగానూ సాగాయి.

వెనుక శ్రీనాథ యుగంలో గౌరన ద్విపదలలో చెప్పిన హరిశ్చంద్రుని కథనే శంకర కవి చంపూ కావ్యంగా వ్రాశాడు. కాని, గౌరవ కావ్యాన్ని ఆయన త్రోసి రాజన లేకపోయాడు'' అని దయానిధి ముగించాడు.

''రేపు ఏ యుగ కవులను గురించి చెబుతావు తాతయ్యా!'' అని అడిగింది కమల.

''17వ శతాబ్దం నుంచీ ఆధునిక యుగం దాకా తెలుగు కవిత్వంలో క్షీణ దశ వచ్చిందని విమర్శకుల మతం! అందుచేత ఆ యుగాన్ని వారు 'క్షీణ యుగం' అన్నారు. దాన్ని గురించి చెప్పుకుందాం రేపు!'' అన్నాడు తాతయ్య.

అందరూ ఇంటి ముఖం పట్టారు.





5

# అంబ! పరాకు...

సెలవలు పూర్తి అయి పిల్లలు పట్టణం తిరిగి వెళ్ళే రోజు దగ్గిరికి వస్తూంది. ఉన్న నాలుగు గడియలూ తన కళ్ళ ఎదుట లేకుండా వారు ప్రతి సాయంత్రమూ తోటల వెంటా, దొడ్ల వెంటా తిరుగుతూ ఉండడం దయానిధి భార్యకు నచ్చలేదు. ''ఏమైనా సరే ఇవాళ మిమ్మల్ని బయటికి వెళ్ళనివ్వను. ఆ చెప్పుకునే కథ లేవో మన డాబా మీదే కూచుని చెప్పుకోండి. నేనూ వింటాను'' అంది ఆవిడ.

డాబా ఊడ్చి నీళ్ళు చల్లి జంపకానాలు పరిచారు. ఫలహారాలు ముగించుకుని అంతా డాబా మీద చేరారు.

''క్షీణ యుగం అంటే తాతయ్యా! ఈ యుగంలో తరువాతి తరాలవారు చదువుకోడానికి యోగ్యమైన గొప్ప రచనలు అసలు ఏవీ రాలేదా?'' అని అడిగింది అమల.

''రాకేమమ్మా! వేమన, క్షేత్రయ్య, త్యాగయ్య, గోపన్న మొదలైన మహానుభావులు కొందరు ఈ యుగంలో పుట్టకపోలేదు. అయితే - ప్రధానంగా ఈ యుగంలో కవి

త్వపు విలువలలో మార్పు వచ్చింది. కవిత్వం వెనుకటి కంటె పల్చబడింది. అందుకని ఈ యుగాన్ని క్షీణయుగం అన్నారు" అన్నాడు తాతయ్య.

"క్షీణ యుగంలో మన తెలుగు కవిత్వంలో వచ్చిన మార్పు లేమిటో ముందు వివరంగా చెప్పు తాతయ్యా! ఆ తరువాత ఆ యుగం నాటి కవులను గురించి చెబుదువు గాని!" అంది కమల.

తాతయ్య తాపీగా మొదలు పెట్టాడు :

"1530 లో శ్రీకృష్ణ దేవరాయలు నిర్యాణం చెంద డంతో విజయనగర సామ్రాజ్య వైభవం క్షీణింపసాగింది. రాయల వారసులు రాక్షస తంగడి యుద్ధంలో ఓడిపోయి విజయనగరం వదలి పెనుగొండ, చంద్రగిరి వలస పోవలసి వచ్చింది. రాజాశ్రయం లేక కవులు నిరాశ్రయు లయారు. ఆ తరువాత దక్షిణాదిని విజయనగర సామంత రాజులైన తంజావూరు, మధుర నాయక రాజులు స్వాతంత్ర్యం ప్రక టించి స్వంత సామ్రాజ్యాలు స్థాపించారు. వారి ఆస్థానాలే అటు తరువాత తెలుగు సాహిత్యానికి పట్టుగొమ్మ లయాయి. ఆ విధంగా ఈ యుగంలో తెలుగు కవిత్వం దక్షిణాదికి వలస పోయింది.

"నాయక రాజుల పోషణలో సంగీత సాహిత్యాలు కేవలం విలాస సాధనా లయాయి. వేశ్యలు కూడా గాయమ ణులుగా, కవయిత్రులుగా గౌరవాలు అందుకోసాగారు. శృంగార

రసం పెచ్చుమీరి పోయింది. దానికి తోడు హాస్యానికి కూడా ప్రాధాన్యం వచ్చింది. జీవిత పరమార్థాన్ని విస్మరించి, ప్రజలు కేవలం కాముకత్వ పరాయణులుగా తయారు కావడానికి ఈ యుగం సాహిత్యం దోహదం చేసింది. పద్య రచనలో జిగి, బిగి పోయి, పద్యం పల్చబడింది. కేవలం శబ్దాలంకారాల తోనూ, చటూక్తి చమత్కారాలతోనూ కవులు పాఠకులను మురిపింపజూశారు. కవులలో పాండిత్య ప్రకర్ష తగ్గింది. 'ఒక అర్ధ శతాబ్దంలో తంజావూరు ఆస్థానం మన్మథుడి కొలువు కూటం అయింది' అంటారు సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు శ్రీ పింగళి లక్ష్మీకాంతం. ఈ కారణాల చేతనే ఈ యుగాన్ని విమర్శకులు క్షీణయుగంగా భావించడం జరిగింది.

''అయితే - ప్రాచీన సాహిత్యం దృష్ట్యా సాహిత్యపు విలువలూ, జీవితపు విలువలూ క్షీణించినట్టు కనిపించినా, ఆధునిక సాహిత్యం దృష్టితో చూస్తే అంత వరకు పండితులకూ, విద్వాంసులకూ మాత్రమే రసానందం చేకూరుస్తూ వచ్చిన తెలుగు సాహిత్యం ప్రజల భాషకూ, జీవితాలకూ దగ్గిరగా వచ్చే ప్రక్రియకు ఈ యుగంలోనే మొదట అంకురార్పణ జరిగిం దని చెప్పవచ్చును.''

''శ్రీకృష్ణదేవ రాయల తరువాత మళ్ళీ తెలుగు సాహిత్యాన్ని పోషించిన ప్రభువు ఎవరు తాతయ్యా?'' అని అడిగింది కమల.''

''తంజావూరు ప్రభువు రఘునాథ నాయకుడు. ఆయన అపర శ్రీకృష్ణదేవ రాయలు. రాయలు లాగానే రఘునాథుడు

కూడా స్వయంగా కవి, పండితుడు. ఆయన వ్రాసిన కావ్యా లలో ముఖ్యమైనవి: వాల్మీకి చరిత్ర, రఘునాథ రామా యణం. ఆయన మొదలు పెట్టిన రామాయణం ఎందువల్లో పూర్తికాకుండా బాలకాండం మధ్యలోనే ఆగిపోయింది. 'శృంగార సావిత్రి' అని ఆయన మరో కావ్యం వ్రాశాడు. ఆ యుగ ధర్మానికి అనుగుణంగా పరమ పతివ్రత అయిన సావిత్రి కథలో కూడా ఆయన శృంగారం చొప్పించాడు.

"కృష్ణరాయల ఆస్థానానికి పెద్దనగారు ఎలాంటి వాడో రఘునాథ నాయకుని కొలువు కూటంలో చేమకూర వేంకటకవి అలాంటి వాడు. శబ్దాలతో గారడీ చేయడంలో ఈయనంత ఘనుడు తెలుగు సాహిత్యంలో మరొకరు లేరు. ఈయన వ్రాసిన 'విజయ విలాసం' తప్పకుండా చదివి తీర వలసిన తెలుగు కావ్యం. అర్జునుడు తీర్థయాత్రలకు బయలు దేరి వరుసగా 'ఉలూచి' అనే నాగకన్యనీ, 'చిత్రాంగద'నూ, 'సుభద్ర'నూ వివాహం ఆడిన శృంగార రస ప్రధానమైన కథలను వివరించే కావ్యం ఇది. అర్జునుడు కపటయతి రూపంలో సుభద్రతో ప్రసంగించే సందర్భంలో హాస్యం కూడా చక్కగా పోషించబడింది.

"ఆ ఘట్టంలో నుంచి ఒక చిన్న పద్యం వినిపిస్తాను. చేమకూర కవి రచన ఎంత సరళంగానూ, మధురంగానూ ఉంటుందో చూడండి. కపట యతి రూపంలో ఉన్న అర్జు నుడు సుభద్రతో అంటున్నాడు:

గీ. చెలియ! విను రాజ కీరంబు చెట్ట బట్టె
కలికి! విను రాజ హంసంబు కాలు ద్రొక్కె
మంచి శకునంబు లివిగొ నా మాట చూడు
కన్నె! ఈ లోన పెండ్లి కాగలదు నీకు!

"ఇలా తేలిక మాటలతో సరళమైన శ్లేషలతో సాగుతుంది చేమకూర కవి రచన।

"రఘునాథ నాయకుని కుమారుడు విజయ రాఘవ నాయకుని కాలంలో తెలుగు సాహిత్యం మరింతగా ప్రజా సాహిత్య లక్షణాలను అలవరచుకొంది. ప్రజలలో ప్రచారంలో ఉన్న 'యక్షగాన ప్రక్రియ'కు ఈయన హయాములో సాహిత్య గౌరవం లభించింది."

"యక్షగానం అంటే ఏమిటి తాతయ్యా?" కుతూహలంగా అడిగింది విమల.

"జక్కులు (యక్షులు) అనే ఒక జాతివారు అభినయిస్తూ పాడే పాటలతో కూడిన ఒక విధమైన నాటకాన్ని యక్షగానం అంటారు. విజయ రాఘవ నాయకుడు కూడా స్వయంగా కవి, యక్షగాన రచయిత. ఆయన ఉంపుడుకత్తె రంగాజమ్మ 'మన్నారు దాస విలాసం' అనే యక్షగానం వ్రాసింది. ఈ కావ్యంలో విజయ రాఘవుడే నాయకుడు. కాంతిమతి అనే కన్య అతణ్ణి ప్రేమించడం, చివరికి గురువు సాయంతో వారిరువురికీ వివాహం జరగడం దీనిలోని ప్రధాన కథ.

"తంజావూరును నాయక రాజుల అనంతరం కొంత కాలం మహారాష్ట్రులు పాలించారు. నాయక రాజుల లాగానే వారు కూడా సంస్కృతాంధ్ర సాహిత్యాలను పోషించారు. 'సరస్వతీ మహల్' లైబ్రరీ అనే గొప్ప తాళ పత్ర గ్రంథాలయాన్ని వారు స్థాపించారు. నేటికీ పరిశోధకులకు అది తీర్థయాత్రాస్థలంగా ప్రసిద్ధి పొందింది.

"తంజావూరు నేలిన మహారాష్ట్రులలో ప్రతాప సింహ రాయల ఉంపుడుకత్తె ముద్దుపళని రాధాకృష్ణుల కథను 'రాధికా సాంత్వనం' అనే శృంగార కావ్యంగా వ్రాసింది. దీనిలో శృంగారం మరీ పచ్చిగా ఉందని బ్రిటిష్ ప్రభుత్వం కొన్నాళ్ళ పాటు దీని ప్రచురణను నిషేధించింది."

"తాతయ్యా! త్యాగరాజు కూడా తంజావూరు వాడే గదూ!" అంది విమల తాతయ్య ధోరణికి అడ్డు వస్తూ.

"ఔను - త్యాగయ్య కూడా తంజావూరు వాడే! అయినా ఆయన కంటె పూర్వులైన వేమన్న, రామదాసు, క్షేత్రయ్యలను గురించి చెప్పుకున్న తరువాత గాని ఆయనను గురించి మనం చెప్పుకో కూడదు. అయితే తంజావూరు కవుల ప్రసక్తి వచ్చింది గనుక ఇక్కడే ఆయనను గురించి కూడా చెప్పేస్తాను. ఆయన తెలుగు వారికే కాదు, దక్షిణ భారతీయు లందరికీ ఆరాధ్యుడైన వాగ్గేయకారుడు. నేటికీ దక్షిణాది అంతటా పాట కచ్చేరీలలో త్యాగయ్య కూర్చిన తెలుగు కృతులే పాడతారు. త్యాగరాజు (1767-1847) తంజావూరు

ప్రాంతం వాడే అయినా ఏ రాజు ఆశ్రయాన్నీ ఆశించినవాడు కాడు. రాముణ్ణే నమ్ముకొని ఆయన కీర్తనలే



త్యాగయ్య (*1767-1847*)

పాడుతూ భగవత్ సాక్షాత్కారం పొంది, తన జీవితంలో ఎన్నెన్నో మహిమలు ప్రదర్శించిన మహా భక్తాగ్రేసరుడు త్యాగరాజు. "నిధి చాల సుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా?" అని ఐహిక భోగ భాగ్యాలను రోసి రాముని సన్నిధే తనకు సర్వస్వమూ అని నమ్మిన వాడు ఆయన. త్యాగరాజు వ్రాసిన కృతులు కొన్ని వేలు ఉన్నట్లు చెప్పబడుతున్నా సుమారు వేయి కృతులు మాత్రమే ఇప్పుడు ప్రచారంలో ఉన్నాయి. విడి విడి కృతులే కాక త్యాగరాజు 'ప్రహ్లాద భక్త విజయం', 'నౌకా చరిత్రం' అనే రెండు యక్షగానాలను కూడా వ్రాశాడు. వీటిలో మొదటిది భక్తిరస ప్రధానమైతే, రెండోది గోపికల మధుర భక్తిని ప్రతిపాదించేది.

"మధుర నాయకరాజులలో విజయరంగ చొక్కనాథుడు (1706-1782) తెలుగు కవులను విశేషంగా పోషించాడు. ఈయన ఆస్థానంలో చెప్పుకోవలసిన ప్రధాన కవి శేషము వేంకటపతి. ఈ కవి వ్రాసిన 'తారా శశాంక విజయ' కావ్యం బహుళ ప్రచారం పొందింది. అది అధర్మ శృంగారమే అయినా, ఆ శృంగార రసాన్ని ఆయన చక్కగా పోషించాడు. ఆధునిక కాలంలో గుడిపాటి వెంకటచలం తెలుగులో ప్రారంభించిన స్త్రీ స్వాతంత్ర్యోద్యమానికీ, విశృంఖల ప్రణయ సిద్ధాంతానికీ క్షీణయుగంలోని ఈ శేషం వేంకట కవి కావ్యంలోనే మనకు బీజాలు కనిపిస్తాయి.

"తార చంద్రుడితో వాదించే సందర్భంలో ఈ కావ్యంలో విశృంఖల ప్రణయ సిద్ధాంతాన్ని ఆమె ఇలా ఉపన్యసిస్తుంది :

ఉ. లోకములోన కొంద రబలల్ సతులన్ తనియింపలేక ఆ
స్తోక మనీష అన్య పురుషుల్ తమ కాంతల నంటకుండ తా
టాకులలోన వ్రాసిరి 'పరాంగన గూడిన పాప' మంచు; ఆ
య్యాకుల పాటు చూచి ఇపు డాకులపా టెనయంగ నేటికిన్ ?

మధుర నాయక రాజుల పోషణలోనే ప్రసిద్ధ కావ్యాలు వ్రాసిన మరో కవి సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు. ఈయన వ్రాసిన 'అహల్యా సంక్రందనం' అనే కావ్యం చక్కని శబ్దాలంకారాలతో మధురంగా సాగింది. ఈ చంపూ కావ్యమే కాక వేంకట కృష్ణప్ప నాయకుడు 'జైమిని భారతం', 'సారంగధర చరిత్ర' అనే రెండు వచన కావ్యాలు కూడా వ్రాశాడు. ఆధునిక కాలంలో ప్రాచుర్యం లోకి వచ్చిన వచన రచనలకు కూడా ఈ క్షీణ యుగంలోనే ఆ విధంగా శ్రీకారం చుట్టబడింది.

"మధుర తరువాత సాహిత్య పోషణ విషయంలో చెప్పుకోదగిన దక్షిణాది రాజ్యం మైసూరు. మైసూరు ప్రభువు చిక్కదేవరాయల సేనాని 'కళువె వీరరాజు' ఆంధ్ర మహా భారతాన్ని వచన కావ్యంగా వ్రాశాడు. ఆయన మిత్రుడు తుపాకుల అనంత భూపాలుడు రామాయణాన్నీ, విష్ణు పురాణాన్నీ వచన కావ్యాలుగా రచించాడు. కళువె వీరరాజు కుమారుడు నంజరాజు 'హాలాస్య మాహాత్మ్యం'

అనే శైవమత ప్రధాన మైన కావ్యం వ్రాశాడు. ఆ విధంగా ఆ రోజులలో మధుర, మైసూరు సంస్థానాలు తెలుగులో వచన సాహిత్యశాఖకు మంచి పుష్టి చేకూర్చాయి.

"దక్షిణాదిని వదలి మన దృష్టిని తెలంగాణా వైపు మళ్ళిస్తే మనకు ప్రముఖంగా గోచరించే కవి భద్రాద్రి రామదాసు (17వశతా.). ఈయన అసలు పేరు కంచెర్ల గోపన్న. రామభక్తుడై 'రామదాసు' అయ్యాడు. ఈయన చరిత్ర అంతా సినిమాలలోనూ, నాటకాలలోనూ మీరు చూసే ఉంటారు. అన్నట్టు మీరు హైదరాబాదులో



కంచెర్ల గోపన్న [రామదాసు]
(1670 ప్రాంతం)

ఉంటున్నారు గదా! ఎప్పుడైనా రామదాసును తానాషా జైలులో ఉంచిన గోల్కొండ కోటను చూసి వచ్చారర్రా?''! అని అడిగాడు మనుమరాళ్లను తాతయ్య.

''చూశాం తాతయ్యా!'' అన్నారు ముగ్గురూ ఏక కంఠంతో. ''అయితే అక్కడ వాళ్లు చెప్పిన మాట లన్నీ నిజమే అన్న మాట! అదేదో కట్టుకథ అనుకున్నాం!'' అన్నారు.

''సుమారు మూడు వందల ఏళ్ల క్రితం ఈ తెలుగు గడ్డమీద వాస్తవంగా జీవించిన వ్యక్తమ్మా రామదాసు ఆయన వ్రాసిన దాశరథీ శతంలోని పద్యాలూ, వివిధ సందర్భాలలో ఆయన గానం చేసిన పాటలూ తెలుగు ప్రజలు ఈ నాటికీ అతి ఆప్యాయంగా పాడుకుంటున్నారు. దాశరథీ శతకం లోని మొదటి పద్యం 'శ్రీ రఘురామ చారు తులసీ దళ దామ!' అనేది రాని తెలుగువాడు ఉండ దంటే అతిశయోక్తి కాదు. త్యాగయ్య లాగ రాముణ్ణి ప్రత్యక్షం చేసుకున్న పరమ భక్తుడు రామదాసు. త్యాగయ్య, రామదాసు నిజానికి తెలుగువారి పున్నెపు పంటలు!

''రామదాసు వ్రాసిన దాశరథీ శతకంలోని పద్యాలు ఇటీవలి దాకా పిల్ల లందరి చేత కంఠస్థం చేయించేవారు. ఈ పద్యం వినండి- రామదాసు భక్తి ఎంత నిజమైందో మీకు తెలుస్తుంది!

ఉ. దాసిన చుట్టమా శబరి? దాని దయామతి నేలినావు; నీ
దాసుల దాసుడా గుహుడు? తావక దాస్య మొసంగినావు; నే
చేసిన పాపమో? వినుతి చేసిన కావవు; కావుమయ్య నీ
దాసులలోన నే నొకడ! దాశరథీ! కరుణా పయోనిధీ!

"తెలంగాణా ప్రాంతం సుల్తానుల పాలనలో ఉన్నా ఆ సుల్తానులు కూడా తెలుగు భాషను ఆదరించి తెలుగు కవులను పోషించారు. ఇబ్రహీం కుతుబ్ షాహి అనే సుల్తాను అద్దంకి గంగాధర కవి చేత 'తపతీ సంవరణోపాఖ్యానం' అనే ప్రబంధం వ్రాయించాడు. ఇది ప్రబంధ యుగంలోని ప్రబంధాలతో సాటి రాగలదిగా విమర్శకుల ప్రశంస అందుకుంది. ఆ కాలంలో తెలంగాణాలో ఇంకా ఎందరో కవులు పుట్టినా, వారందరినీ స్మరించేందుకు మనకు టైము లేదు. ప్రొద్దు క్రుంకి పోతూంది" అన్నాడు తాతయ్య.

ముసి ముసి చీకటి పడుతూంది. దొడ్లో వేపచెట్టు మీదనుంచి చల్లని గాలి వీస్తూంది. "వంటయి పోవచ్చింది. ఇంక త్వరగా మీ కథ ముగించండి!" అని క్రింద నుంచి అమ్మమ్మ కబురు చేసింది.

క్షేత్రయ్య, వేమన్న, కవిచౌడప్ప లాంటి కవులు ఇంకా మిగిలే ఉన్నారే అని తాతయ్య హడావిడిగా తరువాతి కథ అందుకున్నాడు: "ఈ యుగంలో సర్కారు జిల్లాలలోనూ, రాయలసీమలోనూ కూడా కొందరు ప్రముఖ కవులు పుట్టకపోలేదు. అలాంటి వారిలో ముఖ్యంగా మనం స్మరించవలసినవారు: వేమన, క్షేత్రయ్య. 'వేమన' సినిమా

మీరు చూసే ఉంటారు గనుక ఆయన కథ మీకు వివరంగా



*వేమన యోగి (1620 ప్రాంతం)*

చెప్ప నక్కరలేదు. తెలుగు కవిత్వాన్ని అశేషాంధ్ర ప్రజల హృదయాలకూ సన్నిహితం చేసిన మొట్టమొదటి ప్రజాకవి వేమన. 'ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు....' వంటి సరళమైన ఆటవెలదులలో వేదసారం అంతా ప్రజలకు అరటి పండు వలిచి చేతిలో పెట్టినట్టు చెప్పిన మహా మనీషి ఆయన. మొదట 'కామి' అయి, తరువాత 'మోక్ష కామి' అయిన వేమన యోగి సమాధి కదిరి సమీపంలో ఉన్న కటారుపల్లెలో నేటికీ ప్రజలచేత పూజ లందుకుంటూంది. గొప్ప మానవతావాది అయిన వేమన యోగి చెప్పిన పద్యాలు సుమారు మూడు వేల దాకా ఉన్నాయి.

"వేమన పద్యాలు కూడా నాలుగు-బహుశః మీరు విని ఉండనివి - వినిపిస్తాను :

ఆ. పనస తొనల కన్న పంచదారల కన్న
జుంటి తేనె కన్న జున్ను కన్న
చెరుకు రసము కన్న చెలి మాట తీపురా
విశ్వదాభిరామ! వినుర వేమ!

ఆ. గాజు కుప్పెలోన కదగుచు దీపం బ
దెట్టు లుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టి వాని దేహంబు నందున
విశ్వదాభిరామ! వినుర వేమ!

ఆ. శక్తి ఉన్న చోట పరమేశ్వరుం డుండు
శక్తి లేని చోట పాప ముండు
శక్తి కలుగు వాడు పరమాత్మ డగునయా
విశ్వదాభిరామ! వినుర వేమ!

ఆ. బ్రహ్మ మనగ నెటనొ పర దేశమున లేదు
బ్రహ్మ మనగ తానె బట్ట బయలు
తన్ను తా నెఱిగిన తానె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ! వినుర వేమ!

"తెలుగును త్యాగయ్య గానయోగ్యం చేస్తే, దాన్ని నృత్య యోగ్యంగా కూడా చేసిన మధుర వాగ్గేయకారుడు క్షేత్రయ్య (17 వ శతా.). కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామంలో



క్షేత్రయ్య (*1600 - 1660*)

ఈ మన జన్మించారు. శ్రీకృష్ణుని శృంగార లీలలను వర్ణిస్తూ ఈ మన వ్రాసిన 'మొవ్వ గోపాల పదాలు' ఇటీవల దేవ దాసీల బిల్లు వచ్చి దేవదాసీ వ్యవస్థ రద్దయే వరకూ ఊరూరా, వాడ వాడలా దేవదాసీలు అభినయిస్తూ ఉండేవారు. 'ఇన్నాళ్ళ వలె కాదమ్మా - మా మొవ్వ గోపాలుడు ఎన్నో విద్యలు నేర్చినాడమ్మా !' వంటి ఈయన పదాలు పాట కచ్చేరీలలోనూ రికార్డులలోనూ మోగిపోయి-ఆంధ్ర ప్రజల న్మురూతలూగించి నవి-ఎన్నో ఉన్నాయి. ఈయన వ్రాసిన పదా లన్నిటి చివరా 'మొవ్వ గోపాల' ముద్ర కనిపిస్తుంది. ఈయన దక్షిణాదికి కూడా వెళ్లి తంజావూరు రఘునాథ నాయకుని ఆస్థానం సందర్శించి ఆ రాజకవి చేత అఖండ సమ్మానా లందినట్టు చరిత్ర చెబుతూంది.

''మచ్చుకి ఒక్క మొవ్వ గోపాల పదం పాడి విని పిస్తాను.

పల్లవి :

ఇద్దరి వలెనే. గూడి - ఎవ రున్నారు తెల్పరా ?

అనుపల్లవి

ఒద్దికతో మనవలె - నున్నారా ? మొవ్వ గోపాలా !
॥ఇద్దరి వలెనే॥

మున్ను నలరాజు నీవే - ముదిత దమయంతి నేనే
చెన్నుగ శ్రీకృష్ణుడు నీవే - శ్రీ రుక్మిణీదేవి నేనే
॥ఇద్దరి వలెనే॥

అల రఘురాముడు నీవే - అయిన సీతాదేవి నేనే
ఇలను రంగేశుడు నీవే - ఏలిన రంగ నాయకి నేనే
॥ఇద్దరి వలెనే॥

సత్య హరిశ్చంద్రు డీవే - సామీ! చంద్రమతి నేనే
నిత్యము మదనుడు నీవే - నీకు రతిదేవి నేనే
॥ఇద్దరి వలెనే॥

"ఈ యుగంలో ప్రసిద్ధులైన కవులు ఇంకా చాలా మంది ఉన్నారు. వారందరినీ స్మరించేందుకు ఇప్పుడు మనకు వ్యవధి లేదు. ప్రధానమైన కొద్ది మందిని గురించి మాత్రమే చెప్పి ఈ నాటి కథ ముగిస్తాను.

"ఏనుగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన, ఎలమంచిలి బాలసరస్వతి సంస్కృతంలో భర్తృహరి రచించిన నీతి శత కాన్ని తెలిగించారు. కాని ఆ ముగ్గురి అనువాదాలలోనూ ఏనుగు లక్ష్మణ కవి చేసిన అనువాదానికే ఎక్కువ ప్రశస్తి వచ్చింది. బహుశః మీ పాఠ్య పుస్తకాలలో ఆయన పద్యాలు కొన్నైనా మీరు నేర్చుకుని ఉంటారు.

"కూచిమంచి తిమ్మకవి పిఠాపురం వాడు. తెలుగులో శ్రీనాథుడు మొదటి కవి సార్వభౌముడైతే ఈయన రెండవ 'కవిసార్వభౌమ' బిరుదాంచితుడు. 'రాజశేఖర విలాసం', 'నీలా సుందరీ పరిణయం', 'అచ్చ తెనుగురామాయణం' ఈయన రచనలలో చెప్పుకోదగ్గవి. ఈయన తమ్ముడు కూచిమంచి జగ్గకవి 'చంద్రరేఖా విలాపం' అనే తిట్టు కావ్యం

వ్రాసి తెలుగులో ప్రముఖ తిట్టు కవిగా ప్రసిద్ధి పొందినవాడు. ఇలాంటి వాడే మరో తిట్టుకవి పిండిప్రోలు లక్ష్మణ కవి. ఆయన వ్రాసిన 'రావణ దమ్మీయం' కూడా ఆ రోజులలో బాగా ప్రచారం పొందింది. ఈ సందర్భంలో స్మరించదగ్గ మరో తిట్టుకవి చౌడప్ప. 'హాస్య కవి జాణ' అనే బిరుదు గల ఈ కవి తిట్టు పద్యాలతో, బూతు పద్యాలతో సంఘంలోని దురాచారాలను దుయ్యబట్టాడు. కందపద్యం నడిపించటంలో ఈయన మహా ఘటికుడు.

కవి చౌడప్ప కంద పద్యాలు ఎంత సరళంగా, అప్రయత్న సిద్ధంగా సాగుతాయో 3, 4 పద్యాలు వినిపిస్తాను వినండి :

కం. వేయారు వగల కూరలు
కాయ లనేకములు ధాత్రి కల వందులలో
నాయకములురా కాకర
కాయలు మరి కుందవరపు కవి చౌడప్పా!

కం. పెద్దన వలె కృతి జెప్పిన
పె ద్దనవలె, అల్ప కవిని పె ద్దనవలెనా ?
ఎ ద్దనవలె, మొ ద్దనవలె
గ్ర ద్దనవలె కుందవరపు కవి చౌడప్పా!

కం. పప్పే పస బాపలకును;
ఉప్పే పస రుచుల కెల్ల; ఉవిదల కెల్లన్
కొప్పే పస; దంతములకు
కప్పే పస కుందవరపు కవి చౌడప్పా!

కం. నా పేరి వినని వానిని
భానుని కిరణములు మీద సోకని వానిన్
వానను తడియని వానిని
కానమురా కుందవరపు కవి చౌడప్పా!

ఈ యుగంలో కూడా ఒక కవయిత్రి 'తరిగొండ వెంగమాంబ' కనిపిస్తుంది. ఆమె చక్కని విదుషి. ఆమె వ్రాసిన శ్రీ వేంకటాచల మాహాత్మ్యం, జ్ఞాన వాసిష్ఠ రామాయణం, రాజయోగసారం విద్వాంసుల మన్ననలు పొందాయి. కాసుల పురుషోత్తమ కవి వ్రాసిన ఆంధ్రనాయక శతకం, కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణం, వెంకటగిరి సంస్థానకవి గోపీనాథ వేంకట కవి వ్రాసిన గోపీనాథ రామాయణం, చిత్రకవి సింగనార్యుని బిల్హణీయం ఇలా ఇంకా ఎన్నెన్నో గ్రంథాలను గురించి మనం చెప్పుకోవచ్చు. కాని, ఎన్ని చెప్పినా కావ్యం స్వంతంగా చదువుకుంటే తప్ప ఆ కావ్యం వల్ల కలిగే ఆనందం అనుభవంలోకి రాదు. మీరు పెద్దవారైన తరువాత వరుసగా మన పూర్వీకులు వ్రాసిన కావ్యాలన్నీ స్వయంగా చదువుకుని తెలుగుభాష అందచందాలు ఆకళింపు చేసుకోవాలి."

"ఇలా ఇంటి దగ్గర కూర్చుంటే బోరు కొడుతూంది తాతయ్యా! రేపు సరదాగా మళ్ళీ ఉత్తరం వేపు మామిడి తోటకు వెళదాం!" అంది కమల గోముగా.

''అలాగే తల్లీ! రేపొక్క రోజే గద మీరుండేది! ఎల్లుండి ప్రయాణమే నాయె! అందులోనూ రేపు అధునిక యుగం గురించి మనం చెప్పుకోవాలి. అది చాలా సేపు పడు తుంది. అందుకని రేపు మీరు పెందరాళే తయారవండి. నాలు గింటికే బండి కట్టిస్తాను.''

''అలాగే తాతయ్యా! మీరు ఎప్పుడంటే అప్పుడే మేము రెడీ!''

క్రింద నుంచి రుసరుస లాడుతూ వచ్చింది అమ్మమ్మ ''అబ్బబ్బ! మీ కథలూ మీరూను! అన్నం చల్లారి పోతూంది. ఇంకనైనా లేవండర్రా!'' అంటూ.

ఫౌలో మంటూ అంతా క్రిందికి బయలు దేరారు.



6

# నా ఇచ్ఛయే గాక...

మర్నాడు మధ్యాహ్నం ఉన్నట్టుండి పెద్ద గాలి దుమారం చెలరేగి, వడగళ్ల వాన పడింది. మనుమరాళ్ల మామిడి తోట ప్రయాణం మూల పడింది గదా అని అమ్మమ్మ సంతోష పడింది. కాని మూడు గంటల కల్లా ఎక్కడిది మబ్బు లక్కడ విచ్చిపోయి ఎండ ఫెళ్లున కాయడంతో పిల్లలు పట్టు బట్టారు - ఏమైనా సరే మామిడి తోటకు వెళ్లి తీరవలసిందే అని, దయానిధికి బండీ కట్టించక తప్పింది కాదు.

ఎప్పటి లాగే కోటయ్య ఒక చెట్టు క్రింద శుభ్రం చేసి జంపకానాలు పరిచాడు. ఫలహారాలూ, కాఫీలూ పూర్తి అయిన తరువాత అమల తాతయ్యతో అంది : "ఆధునిక కవులలో పత్రికల ద్వారా, రేడియో ద్వారా మా చెవిని బడ్డ కవుల పేర్లే బోలెడు ఉన్నాయి. వారందరిని గురించీ, వారి రచనలను గురించీ విడి విడిగా చెప్పడం మొదలు పెడితే మనకు ఇవాళ టైము చాలదు. అందుచేత - ముఖ్యంగా ఈ యుగంలో మన తెలుగు కవిత్వంలో వచ్చిన మార్పులను గురించీ, ఆ మార్పులను తెచ్చిన ప్రధానమైన కవులను గురించీ

మాత్రమే చెప్పు తాతయ్యా! తక్కిన వాళ్లను గురించి మా అంతట మేమే చదువుకుంటాం!"

"అలాగే తల్లీ! నేనూ అదే అనుకుంటున్నాను. లేకపోతే ఈ యుగంలో నుంచి ఒక పట్టాన బయట పడడం సాధ్యం కాదు" అంటూ తాతయ్య తాపీగా ఇలా కథ మొదలు పెట్టాడు :

"19 వ శతాబ్దంలో మన తెలుగు కవిత్వం ఒక పెద్ద మలుపు తిరిగింది. భాషలో, భావాలలో, ఛందస్సులలో, సాహిత్యపు విలువలలో - అన్నింటిలోనూ పెద్ద మార్పు వచ్చింది. ఈ మార్పుకి కారణాలు రెండు. ఒకటి : మనవాళ్లు ఇంగ్లీషు చదువుకుని, ఆ ఇంగ్లీషు సాహిత్యంతోనూ, ఆ సాహిత్య ప్రక్రియలతోనూ వారికి పరిచయం ఏర్పడడం. రెండు : ముద్రణ యంత్రం వచ్చి పుస్తకాలు అచ్చు వేసి విరివిగా సరఫరా చేసే అవకాశాలు ఏర్పడడం.

డా. విలియం కారీ ఇతర భారతీయ భాషలతో పాటు తెలుగుకు కూడా ముద్రణ యంత్రం తయారు చేయించి, బైబిల్ తెలుగు అనువాదం ముందుగా అచ్చు వేయించాడు. ఆ తరువాత ఆంధ్ర దేశంలో కలెక్టరుగా పని చేసిన సి. పి. బ్రౌన్ దొర వివిధ పండితుల సాయంతో తాళపత్రాలలో ఉన్న ప్రాచీనాంధ్ర కావ్యాలను పరిష్కరించి ప్రచురించడం ప్రారంభించాడు. కందుకూరి వీరేశలింగం పంతులు, వావిళ్ల రామస్వామి శాస్త్రులు మొదలైన వారు ఆ తరువాత ఈ పనిని కొనసాగించి ప్రాచీన గ్రంథాలను చాలావరకు అచ్చులోకి తెచ్చారు.

"ఏ. డి. కాంప్‌బెల్, బ్రౌన్‌దొర మొదలైన వారు ఇంగ్లీషు వారు తెలుగు నేర్చుకోడానికి వీలుగా ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణాలూ, 'తెలుగు-ఇంగ్లీషు' నిఘంటువులూ ప్రకటించారు. బ్రౌన్‌దొర వ్రాసిన 'తెలుగు-తెలుగు నిఘంటువు,' 'ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు' ఇప్పటికీ వాడుకలో ఉన్నాయి. పాశ్చాత్య పండితులలో బ్రౌన్‌దొర తెలుగు భాషకు చేసిన సేవ అనల్పమైంది.

"బ్రౌన్‌దొర తెలుగులో పద్యాలు కూడా వ్రాసేవాడు. కవులనూ, పండితులనూ పోషించేవాడు. ఒకప్పుడు ఒక పండితుడు అతి దీనంగా ఆర్థిక సహాయం అర్థిస్తూ భాగవతంలో గజేంద్రమోక్షంలోని ఈ పద్యం ఉత్తరంలో వ్రాసి పంపించాడట!

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యె. ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను. మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్. శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప ఇతఃపరం బెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే! ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

"అంత దీనంగా ఆత్మ గౌరవం లేకుండా ఆయన తనను ఈశ్వరుణ్ణి చేసి పొగడడం బ్రౌన్‌దొరకు నచ్చలేదు. వెంటనే భాగవతంలోనించే మరో పద్యం తీసి ఆయనకు వేదాంతం బోధిస్తూ బ్రౌన్‌దొర ఇలా జవాబు వ్రాశాడట :

౬. ఏను మృతుండ నౌదు నని ఇంత భయంబు మనంబు లోపలన్
మానుము సంభవంబు గల మానవ కోట్లకు చావు నిక్కమౌ ।
కాన హరిన్ తలంపు మిక కల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవ నాథ ! పొందెదవు మాధవ లోక నివాస సౌఖ్యముల్ ।

ఇలాంటి చాటుకథ లెన్నో బ్రౌన్‌దొరను గురించి ప్రచారంలో ఉన్నాయి.''

''అదంతా సరే - ముఖ్యంగా తెలుగు కవిత్వంలో ఈ యుగంలో వచ్చిన మార్పులు మాకు చెప్పు తాతయ్యా!'' అంది కమల.

''అంత తొందరైతే ఎలాగమ్మా ? ఈ యుగంలో తెలుగు కవిత్వంలో ఎందుకు ఇంత పెద్ద మార్పు వచ్చిందో ఆ పరిస్థితులను ముందుగా అర్థం చేసుకోవాలి. అందుచేత మరి కొన్ని విశేషాలు కూడా చెప్పుకుంటే గాని తెలుగు కవిత్వం కథలోకి మనం రావడం కుదరదు.''

''కమల మాటలకేం లే! నీ పద్ధతిలోనే నువు చెప్పుకు పో తాతయ్యా !'' అని తాతయ్యను ప్రోత్సహించింది అమల. తాతయ్య చెప్ప సాగాడు :

''నన్నయ దగ్గిరనుంచీ వచ్చిన మన కవిత్వ భాషకు తెలుగు భాషలో ఒక వ్యాకరణం లేకపోవడంతో దక్షిణాంధ్ర యుగంలో కవిత్వ భాషలో వాడుక పదాలూ, గ్రామ్య ప్రయోగాలూ విశృంఖలంగా ప్రవేశించడం మొదలు పెట్టాయి. దాన్ని అరికట్టి తెలుగుకు ఒక ప్రామాణిక కవిత్వ భాషను నిర్ణయించాలని చిన్నయ సూరి 'బాల

వ్యాకరణం' వ్రాశాడు. దానిలో కొన్ని మార్పులూ, చేర్పులూ చేస్తూ ఆయన శిష్యుడు బహుజన పల్లి సీతారామాచార్యులు 'ప్రౌఢ వ్యాకరణం' వ్రాశాడు. ఈ శతాబ్దం తొలి



*వేదం వేంకట రాయశాస్త్రి (1853-1929)*

పాదం వరకూ ఈ రెండు వ్యాకరణాలూ తెలుగు కవిత్వ

భాషను శాసించాయి. చిన్నయసూరి తాను సూచించిన ప్రామాణిక భాషలో 'నీతి చంద్రిక' అని ఒక వచన కావ్యం వ్రాశాడు. దానికి విశేషప్రశస్తి వచ్చింది.

''చిన్నయ సూరి ఒరవడి పెట్టిన ప్రామాణిక భాషను ఆదరించిన వారిలో ప్రముఖులు : వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, జనమంచిశేషాద్రి శర్మ, మంత్రి ప్రెగడ భుజంగరావు వంటి వారు ఎందరో ఉన్నారు. వీరిలో చాలామంది శతాధిక గ్రంథకర్తలు. అంటే 100 కంటె ఎక్కువ కావ్యాలు వ్రాసినవారు. శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రి రామాయణ, భారత, భాగవతాలను మూడింటినీ ఒక్క చేతిమీదుగా తెలిగించారు.

''సంఘసంస్కర్తగానే కాకుండా ఆధునికాంధ్ర సాహిత్య యుగకర్తగా కూడా ప్రసిద్ధిపొందిన కందుకూరి వీరేశలింగం పంతులు కూడా బాల, ప్రౌఢ వ్యాకరణాల భాషనే ఆదరించాడు. ఆ భాషలోనే అనేక కావ్యాలు వ్రాశాడు. సంస్కృత నాటకాలను తెలిగించాడు. అయితే-భాషలోనూ, కవిత్వ లక్షణంలోనూ ఆయన ప్రాచీన సంప్రదాయాన్నే అనుసరించినా ఇంగ్లీషు సాహిత్యంలోవి నవల, కథానిక, నాటకం, ప్రహసనం, జీవిత చరిత్ర, యాత్రా గ్రంథాలు వంటి వివిధ నూతన సాహిత్య ప్రక్రియలను మొట్టమొదటిసారిగా తెలుగులో ప్రవేశపెట్టి ఆధునిక యుగానికి అంకురార్పణ చేసినవాడు అయాడు ; ఆయన రచనలలో తప్పకుండా చదువవలసినవి : స్వీయచరిత్ర, కవుల

చరిత్ర, కాళిదాసుని సంస్కృత 'అభిజ్ఞాన శాకుంతల' నాటకం ఆంధ్రానువాదం.




కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919)

"సంప్రదాయ సిద్ధమైన భాషలోనే, ఆ వెనకటి ఛందస్సులలోనే కవిత్వం చెబుతూ, అయినా తెలుగు పద్యాలను చాలా సరళం చేసి మామూలు సంభాషణలూ, ఉత్తరాలూ కూడా పద్యాలలో వ్రాసుకోవచ్చు ననే ధైర్యం కలిగించి తెలుగు ప్రజలకు తెలుగు కవిత్వం మీద ఎన్నడూ లేనంత ఆదరభావాన్ని కలిగించిన గొప్ప ప్రజాకవులు తిరుపతి వేంకట కవులు. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (1870-1950), దివాకర్ల తిరుపతి శాస్త్రి (1872-1920) కలిసి 'తిరుపతి వేంకట కవులు' అనే పేరుతో జంట కవిత్వం చెప్పడం మొదలు పెట్టారు. దేశం అంతా తిరిగి వివిధ సంస్థానాలలో వారు సమ్మానాలు పొందారు. పెద్ద పెద్ద సాహిత్య సభలలో అష్టావధానాలూ, శతావధానాలూ చేసి తమ ఆశుకవితా చాతుర్యంతోనూ, చమత్కార ప్రసంగ నైపుణితోనూ జనాన్ని విశేషంగా ఆకట్టుకున్నారు. అవధానాలలో ఏ విషయంమీద పద్యం చెప్ప మన్నా అవలీలగా పద్యం చెప్పేసేవారు. ఒకసారి నూజివీడు అవధానంలో ఒక కొంటె పృచ్ఛకుడు 'పకోడి' మీద పద్యం చెప్ప మంటే వారు ఈ ఉత్సాహ వృత్తం చెప్పారు.

నెనగ పిండి, ఉల్లిపాయ, చిన్న మిర్పకాయలున్
చొనిపి అందు అల్ల మింత చొనిపి ముద్ద చేసియున్
అనల తప్తమైన నేతియందు వైచి వేచినన్
చను పకోడి అనెడు పేర చక్కనైన ఖాద్యమై।

"అవధానాలు మేము ఎప్పుడూ చూడలేదు. అవి ఎలా చేస్తారు తాతయ్యా?" అని అడిగింది అమల.

''శతావధానం అనీ, అష్టావధానం అనీ అవధానాలు రెండు రకాలమ్మా ! శతావధానంలో వందమంది పృచ్ఛకు



వేళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (*1870-1950*)

లకు వారు వారు అడిగిన విషయాల మీద తడవకు ఒక

పాదం చొప్పున చెబుతూ వంద పద్యాలు చెప్పాలి. అన్నీ గుర్తుంచుకుని ఆ వంద పద్యాలూ చివరికి అప్పజెప్పాలి।



దివాకర్ల తిరుపతి శాస్త్రి (1872-1920)

"అష్టావధానంలో ఎనమండుగురే పృచ్ఛకు లుంటారు. అయినా, అది శతావధానం కంటె కూడా ఎక్కువ కష్ట మైంది. దీనికి ధారణ శక్తి ఎక్కువగా కావాలి. సమస్య, వర్ణన, నిషిద్ధాక్షరి, వ్యస్తాక్షరి, పురాణం, దత్తపది, ఆశు కవిత్వం, ఖేలనం (చదరంగం), గణనం (పువ్వులు గాని, గంటలు కాని లెక్కపెట్టడం), అప్రస్తుత ప్రసంగం లాంటి అంశాలలో ఏవో ఎనిమిది అంశాలు దీనిలో ఉంటాయి. అవధానిని పద్యాలు ఆలోచించుకోనివ్వకుండా అడుగడుగునా పృచ్ఛకులు అడ్డు తగులుతూ ఉంటారు. అయినా ఏ మాత్రం విసుక్కోకుండా, అలసిపోకుండా అందరికీ జవాబులు చెబుతూ, మధ్య మధ్య చమత్కార ప్రసంగాలతో సభను రంజింప జేస్తూ, చిట్టచివరికి అన్ని పద్యాలూ జ్ఞాపకం పెట్టుకుని అప్పజెప్పాలి! అవధానం ఒక విధంగా బుద్ధికి సంబంధించిన బల ప్రదర్శన లాంటిది!

తెలుగుదేశంలో ఎందరో శిష్యుల్ని తిరుపతి వేంకట కవులు తయారు చేశారు. వారు వ్రాసిన 'పాండవోద్యోగ విజయాలు' నాటకం తెలుగు నాటక రంగస్థలం మీద వేల సార్లు ప్రదర్శింపబడి వాటిలో పద్యాలు ఎన్నో- 'జెండాపై కపిరాజు' లాంటివి - ప్రజలకు కంఠస్థ మైపోయాయి. వారి రచనలలో 'బుద్ధ చరిత్రము' ఇప్పటికీ విశేష ప్రశంసలు పొందుతూంది.

సంప్రదాయ పద్ధతిలోనే వ్రాస్తూ ప్రజలకు సన్నిహితంగా వచ్చిన కవులు మరి కొంద రున్నారు. వారిలో

గయోపాఖ్యానం లాంటి ప్రజాదరణ పొందిన నాటకాలు వ్రాసిన చిలకమర్తి లక్ష్మీ నరసింహం, పాదుకా పట్టాభి



చిలకమర్తి లక్ష్మీ నరసింహం (*1867-1946*)

షేకం వంటి సుప్రసిద్ధ నాటకాలు వ్రాసిన పానుగంటి లక్ష్మీ నరసింహా రావు, భక్తచింతామణి శతకం,' 'వేణీ సంహారం'



*పానుగంటి లక్ష్మీ నరసింహా రావు (1865-1940)*

నాటకం మొదలైన రచనలు చేసిన వడ్డాది సుబ్బారాయ కవి వంటి వారి రచనలను ముఖ్యంగా మీరు చదవాలి।



*గిడుగు వేంకట రామమూర్తి (1863-1940)*

"ఆధునిక యుగంలో వచ్చినా ఇదంతా పాత కవిత్వమే గదా తాతయ్యా! నవ్య కవిత్వం సంగతి ముఖ్యంగా మాకు చెప్పు!" అని అడిగింది - 'నవ్యత' అంటే చెవి కోసుకునే విమల.

"వస్తున్నానమ్మా! అంత తొందరైతే ఎలా? తెలుగులో వ్యావహారిక భాషా వాదం. నవ్యకవిత్వోద్యమం ఒకేసారి వెలిశాయి. గిడుగు రామమూర్తి పంతులు కూల్దేశి దొర ప్రోత్సాహంతో ఒక కొత్త వాదం లేవదీశారు. ప్రజలకోసం వ్రాసే కవిత్వం వారు సహజంగా మాట్లాడుకునే వ్యావహారిక భాషలోనే వ్రాయాలి గాని, నన్నయ దగ్గిర నుంచీ వస్తున్న కృతకమైన - ఇప్పుడు వ్యవహారంలో లేని - గ్రాంథిక భాషలో వ్రాయకూడదు అనే ఆయన వాదం రచయితలను ఎక్కువగా ఆకర్షించసాగింది.

"మొట్టమొదట వాడుక భాషలో ప్రజల ఛందస్సులో ముత్యాల సరాలు వ్రాయడం మొదలు పెట్టిన వాడు గురజాడ వేంకట అప్పారావు. 'దేశ మంటే మట్టి కాదోయ్-దేశ మంటే మనుషులోయ్' వంటి ఆయన వ్రాసిన గొప్ప పంక్తులు ఎన్నో మీకు నోటికి వచ్చే ఉంటాయి."

"అవును తాతయ్యా! ఆయన వ్రాసిన 'దేశభక్తి' గీతం రిపబ్లిక్ దినోత్సవం నాడు మా చేత స్కూల్లో పాడించారు" అంది కమల.

"భాషలోనూ, ఛందస్సులోనూ కొత్తదనం తెచ్చినా గురజాడ అప్పారావు భావనలలోనూ, రస పోషణలోనూ

సంప్రదాయాన్ని విడిచి పెట్టలేదు. 'క్రొత్త ప్రాతల మేల్లు కలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మగా' తాను ముత్యాల స్వరాల్లు కూర్చా నని ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు.



*గురజాడ వేంకట అప్పారావు (1865-1915)*

వాడుక భాషలో కవిత్వం వ్రాయడమే కాకుండా 'కన్యాశుల్కం' అనే ఒక గొప్ప నాటకం కూడా ఆయన వ్రాశాడు. ఆ నాటకంలో విజయనగరం వాడుక భాషకు ఆయన సాహిత్య భాషా గౌరవం కలిగించాడు. మన తెలుగు సాహిత్యంలో 'కన్యాశుల్కం' ఒక ఆణిముత్యం లాంటిది.

"గురజాడ అప్పారావుతో పాటుగానే ఇంగ్లీషు కవితా రీతులను తెలుగులో ప్రవేశ పెట్టిన మరొక ఆధునిక కవితా వైతాళికుడు రాయప్రోలు సుబ్బారావు. ఇంగ్లీషులో షెల్లీ, కీట్సు మొదలైన కవులు నడిపిన 'రొమాంటిక్' ఉద్యమాన్ని ఈయన తెలుగు కవిత్వంలో ప్రవేశ పెట్టారు. తన కవిత్వానికి ఎంచుకున్న ఛందస్సులు పాతవే అయినా కొత్త రకం భావనలతోనూ, అలంకారాలతోనూ ఖండ కావ్యాలు రచించే విధానాన్ని తెలుగులో ఈయన ప్రారంభించారు. ఆ రొమాంటిక్ ఉద్యమాన్నే తెలుగులో 'భావకవిత్వోద్యమం' అంటారు. లైంగిక స్పర్శ లేని అమలిన శృంగారం భావ కవులు ప్రచారం చేశారు. ఒక స్త్రీ, ఒక పురుషుడూ కేవలం స్నేహితుల్లాగ ఒకరిని ఒకరు ప్రేమించుకోవచ్చు. ఇలాంటి ప్రేమను ప్రతిపాదిస్తూ ఈయన వ్రాసిన కావ్యాలలో 'తృణ కంకణం', 'కష్టకమల' లాంటి ఖండ కావ్యాలు ఆ రోజులలో యువకులను ఎక్కువగా ఆకర్షించాయి. ఈ ధోరణి అమలిన శృంగారాన్ని ప్రతిపాదిస్తూ వచ్చిన కావ్యాలలో అబ్బూరి రామకృష్ణరావు వ్రాసిన 'మల్లికాంబ', దేవులపల్లి కృష్ణశాస్త్రి 'కృష్ణ పక్షం', 'ఊర్వశి-ప్రవాసం', తల్లావఝల శివశంకర శాస్త్రి 'హృదయేశ్వరి', దువ్వూరి రామిరెడ్డి వ్రాసిన 'వన

కుమారి', విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన 'గిరికుమారుని ప్రేమ గీతాలు', నాయని సుబ్బారావు వ్రాసిన 'సౌభద్రుని ప్రణయ యాత్ర' పింగళి, కాటూరి కవుల 'సౌందరనందం' వంటి కావ్యాలు చదవాలి.

"భావ కవిత్వానికి ఉదాహరణ అనదగ్గ పద్యం ఒక్కటి చదివి వినిపించు తాతయ్యా!" అడిగింది కమల.

"అలాగే - రాయప్రోలు సుబ్బారావు వ్రాసిన 'విరహ పీథి' అనే ఈ ఖండ కావ్యం వినండి :

గీ. హేమ పాత్రల చందన మెండిపోయె
ద్వారములు వోయుచున్నవి హారములను
పానలం దింకె స్నాన కషాయ గంధ
మబల! ఎవని కోసము వగమయి కృశింతు?

గీ. చెక్కుచెదరని పాపట చిక్కువడియె,
వేణి బంధము శిథిలమై పిరుదు లందె,
కరగి చెరగిన తిలక రేఖలను తుడువ
వతివ: ఎవ డాహరించె నీ ఆర్ద్ర హృదివి!

గీ. పాలు పొంగిన గతి పొంగు ప్రణయ రక్తి
నాపుకొనలేని పడుచు ప్రాయంబులోద
నమ్మి ఎవనికి నీ మన నమ్మికొంటి,
వువిద! ఈ మేఘమాస నవోదయముల!

"ఈ ప్రణయ కవిత్వంలో ఆ నాడు ప్రజలను ఎక్కువగా వెర్రెత్తించింది నండూరి వెంకట సుబ్బారావు వ్రాసిన



*నండూరి వేంకట సుబ్బారావు (1895 - 1957)*

'యెంకి పాటలు'. అవి పామర భాషలో వ్రాయబడినా ఉదాత్త మైన కవిత్వపు విలువలు ఉండడం వల్లా, గాన యోగ్యంగా ఉండడంవల్లా ఆ రోజుల్లో రేడియోలోనూ, సినిమాలలోనూ అవి బాగా మోగిపోయాయి. వ్రాసిన పాటలు మూడు డజ న్లకు మించకపోయినా వాటిమీద ఆ నాటి పత్రికలలో సుమారు మూడు వేల పుటల విమర్శలు వచ్చాయి. సుబ్బారావు గారు స్వయంగా మధురమైన కంఠంతో యెంకి పాటలు పాడేవారు.

"ఒక యెంకి పాట పాడి వినిపిస్తాను వినండి :

పూల బాసలు తెలుసు యెంకికీ
తోట
పూల మనసులు తెలుసు యెంకికీ!

పూల మొక్కల నీటి
జాలు గని నిలుసుండి
పూలన్ని నీ పాచె
ఆలించె నంటాది

పూల బాసలు తెలుసు యెంకికీ
తోట
పూల మనసులు తెలుసు యెంకికీ!

పూలంటు కాలంటి
పున్నె ముం దంటాది

వగలమారి పదుసు
నగ దొడిగె నంటాది,

పూల వాసలు తెలుసు యెంకికీ
తోట
పూల మనసులు తెలుసు యెంకికీ।

తెర లెత్తి పూ పడవ
పరిగెత్తుతా వుంటె,
దారెంట పూలొంగి
దణ్ణ మిడె నంటాది

పూల వాసలు తెలుసు యెంకికీ
తోట
పూల మనసులు తెలుసు యెంకికీ।

పూలతో వియ్యాలు
పూలల్లొ కయ్యాలు
మానల్లె నన్నుంచి
తానె పూవౌనేమొ।

పూల వాసలు తెలుసు యెంకికీ
తోట
పూల మనసులు తెలుసు యెంకికీ।

ఈ సందర్భంలో మనం ముఖ్యంగా స్మరించవలసిన మరో ఇద్దరు కవులు: బసవరాజు అప్పారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి. బసవరాజు గీతాలు ఆవేశ పూరితాలు గానూ, నిసర్గ సుందరంగానూ ఉండి ఆ నాటి కవులకు ఉత్తే

జాన్ని కలిగించాయి. 'వేదుల' పాత ఛందస్సులనే వాడినా



దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి (1897 - 1980)

రొమాంటిక్ భావాలతో కృష్ణశాస్త్రి అనుయాయిగా, 'గౌతమీ కోకిల'గా ప్రసిద్ధి పొందాడు. ఆయన గీతాలు ఎక్కువగా నిరాశా పూరితాలు!

భావకవులు సౌందర్యోపాసకులు; స్వప్నలోక విహారులు; మధురమైన పదబంధాలతో మనోహరమైన చిత్తవృత్తులను కలిగించగల చిత్రమైన ప్రజ్ఞ వీరికి ఉంది. 'దిగిరాను, దిగిరాను దివి నుండి భువికి' అన్న కృష్ణశాస్త్రిని ఈ రకం రచయితలకు ప్రధానమైన ప్రతినిధిగా మనం గ్రహించవచ్చును.

కృష్ణశాస్త్రి భావ కవితోద్యమ ప్రధాన నాయకుడు మాత్రమే కాదు; ఆయన మహావక్త. నవ్య కవిత్వ ప్రాశస్త్యాన్ని గూర్చి పెద్ద పెద్ద సాహిత్య సదస్సులలో ఉపన్యసిస్తూ, భావకవుల గీతాలను మధురంగా గానంచేసి వినిపిస్తూ ఆయన తెలుగు దేశం అంతా తిరిగి నవ్య కవిత్వ బీజాలను దేశం అంతటా వెదజల్లాడు. ఆయన తొలి ప్రచురణ 'కృష్ణపక్షం', 'ఊర్వశి-ప్రవాసం' అనే కావ్య ఖండికల మీద కూడా 'యెంకి పాటలమీద రేగిననంత గాలి దుమారమూ చెలరేగింది. కృష్ణపక్షానికి పేరడీగా 'శుక్ల పక్షం' వ్రాశాడు - అనంత పంతుల రామలింగశాస్త్రి. కృష్ణశాస్త్రి తొలినాటి పద్యాలలో ఆయన సుకుమార భావనను ప్రకటించే ఒక్క పద్యం మీకు చదివి వినిపిస్తాను.

గీ. నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధా గాన మంజువాటి,
ఏ నొక వియోగ గీతిక,

నేను నిదుర

వెన్నెలల దారి నొక రేయి వెడలిపోతి
నొక విపంచీ విరహ కంఠ మొరసి యెగసి
ఏ నొక వియోగ శాలినీ హృదయ రాగ
వేదనా రేఖ, నాకలి వేగు నామె

యంగుళీ కిసలయ చంచ లాంచలముల
విడివడి యనంత విశ్వాన బడితి నాడు.
అదియె మొద లేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ!

ఆ సమయ మాదిగా నప్సరోంగ నాను
రాగ వీథుల, కిన్నరీ రమ్య కంఠ
సీమలో, శ్రావణాంబు దాశ్లేష పాళి,

తారకాలోక పంక్తుల, మాఘ తోరు
పక్షముల తిరుగాడుదు పవలు రేలు-
కన్ను మోడుపు, మెయి వాల్పు గాని లేక!

ఇది ముగియబోని ఏ యర్థ మెరుగ రాని
వేసటే లేని వెర్రి యన్వేషణమ్ము!

ఈ ప్రవాస యాత్రా రతి నిటులె నేను
కదలిపోవుదు నాకావకాశములకు
ఒక్క నిట్టూర్పు వోలిక, ఒక్క మౌన
బాష్ప కణ మటు, ఒక గాథ వాంఛ పగిది!

"భావ కవిత్వం అంతా ప్రణయ కవిత్వమేనా తాతయ్యా?" అడిగింది కమల.

"కాదమ్మా! భావ కవిత్వంలో అమలిన శృంగార కావ్యాలు ఒక శాఖ మాత్రమే! దేశభక్తి కవిత్వమూ భావ కవిత్వానికి చెందిందే! 'విలాప కావ్యాలూ' (ఎలిజీ) ఈ ఉద్యమంలో వచ్చినవే! కొన్ని పాశ్చాత్య కావ్యాలకు తెలుగు అనువాదాలూ ఈ ఉద్యమానికి సంబంధించినవే! అలాగే - స్వేచ్ఛా ప్రవృత్తిని చాటే గీతాలూ భావ కవిత్వంలో ఎన్నో కనిపిస్తాయి.

"తెలుగులో దేశభక్తి కవిత్వం గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావులతోనే ప్రారంభమైంది. రాయప్రోలు వ్రాసిన-

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
పొగడరా నీ మాతృ భూమి భారతిని
ఏ మంచి పూవులను ప్రేమించినావొ
నిను మోచె నీ తల్లి కనక గర్భమున!

'అనే గీతం కూడా మీరు తరచు రేడియోలోనూ, సభలలోనూ వినే ఉంటారు.

"భారత జాతీయ కవిత, ఆంధ్ర జాతీయ కవిత అని దేశభక్తి కవిత్వం తెలుగులో రెండు పాయలుగా సాగింది. భారతమాత భక్తిని ప్రబోధించే తెలుగు జాతీయ గీతాలలో ప్రధానంగా చెప్పుకోదగ్గది దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాసిన "జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ! దివ్యధాత్రీ!" అనే గీతం. జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో గరిమెళ్ళ సత్యనారాయణ వ్రాసిన "బాబూ! మా

కొద్దీ తెల్లదొరతనమూ!'' వంటి గేయాలు ప్రజలను విశేషంగా ఉత్తేజపరిచాయి. అయితే మంగిపూడి వెంకటశర్మ, బలిజేపల్లి లక్ష్మీకాంతం, కవికొండల వెంకటరావు వంటి వారు వ్రాసిన అలాంటి గీతాలు తాత్కాలికంగా ప్రజల నోళ్లలో ఎంతగా నలిగినా వాటిలో తగినంతగా కవిత్వపు విలువలు లేకపోవడం వల్ల త్వరలోనే విస్మృతిపాలయిపోయాయి. జాతీయ కవిత్వ శాఖలో గడియారం వెంకట శేషశాస్త్రి వ్రాసిన 'శివభారతం', విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన 'ఝాన్సీరాణి', 'శివార్పణం' వంటి పెద్ద కావ్యాలు మాత్రం ఇప్పటికీ మన లైబ్రరీలలో పాఠకులను ఆకర్షిస్తున్నాయి.

''ఏమైనా తెలుగు దేశంలో ఆ రోజులలో భారత జాతీయోద్యమం కంటె ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమం ప్రబలంగా సాగడంతో ఆంధ్రాభిమానాన్ని ప్రబోధించే కావ్యాలే కోకొల్లలుగా వచ్చాయి. రాయప్రోలు 'తెలుగుతోట', విశ్వనాథ 'ఆంధ్రప్రశస్తి', 'ఆంధ్ర పౌరుషం', కొడాలి సుబ్బారావు 'హంపీ క్షేత్రం' లాంటి కావ్యాలు ఆంధ్రుల పూర్వ వైభవాన్ని గుర్తుచేస్తూ తిరిగి ఆత్మాభిమానంతో ఆంధ్రులు ముందుకు సాగాలని ప్రబోధించాయి.

''విలాప కావ్యాల (ఎలిజీ)లో విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన 'వరలక్ష్మి త్రిశతి' ముఖ్యంగా చదువదగింది. ఆయన ప్రథమ భార్య మరణానికి ఆయన పొందిన ఆవేదన అంతా కవితా మయంగా వర్ణించిన కరుణ రస ప్రధానమైన గొప్ప

కావ్యం అది. 'విశ్వనాథ' కూడా భావకవిగానే కవితా జీవితం ఆరంభించినా చివరకు సంప్రదాయవాదిగా మారి 'శ్రీమద్రామా



విశ్వనాథ సత్యనారాయణ (1895 - 1976)

యణ కల్పవృక్షం' అనే పేరులో ఆధునికులకు తగిన విధంగా రామాయణ కథను తిరిగి చెప్పారు. ఆ కావ్యానికి లక్ష రూపాయలు విలువగల 'జ్ఞానపీఠ్' అవార్డు లభించింది. తెలుగు కవులలో జ్ఞానపీఠ్ అవార్డు పొందిన కవి ఆయన ఒక్కడే!

"ఆధునిక కవు లందరిలో 'విశ్వనాథ'నే 'కవి సమ్రాట్' అనడానికీ, ఆయన కొక్కడికే జ్ఞాన పీఠ్ అవార్డ్ రావడానికీ ఆయనలో ఉన్న విశేషం ఏమిటి తాతయ్యా?" అని అడిగింది కమల.

"విశ్వనాథ ప్రగాఢమైన అనుభూతి శీలం గలవాడు. అటు సంప్రదాయాన్నీ, ఇటు ఆధునిక భావాలనూ క్షుణ్ణంగా అవగాహన చేసుకుని, 'క్రొత్త ప్రాతల మేలు కలయిక' సాధించినవాడు. తెలుగుదనం, తెలుగు జీవన మాధుర్యం ఆయన రచనలలో అంత ఎక్కువగా మరి ఏ తెలుగు కవి రచనలలోనూ అభివ్యక్తం కాలేదు. పోతన గారు 'తెలుగు' భాగవతం తెలుగు వారికి ఇచ్చినట్టు, ఆయన 'తెలుగు' రామాయణాన్ని తెలుగు వారికి ఇచ్చారు. ఆయన ప్రౌఢకవి. ఆయనను అర్థం చేసుకోడం కష్టం. ఆయన రచనలలో జనానికి సులభంగా బోధపడ్డవి, వందలాది సభలలో ఆయన గానం చేసి జనాన్ని పరవశులను చేసినవి ఆయన 'కిన్నెరసాని పాటలు'. ఆ పాటలలో నుంచి కొన్ని చరణాలు వినిపిస్తాను:

గాలి పిల్లలె పోయి వూదెనో!
మొగిలు కన్నెలు పోయి చెప్పెనో!
తగని కోరిక చేత తనలో కదలి రాజు
సొగసు కిన్నెరసాని చూడాలె ననిపించి

ఉఱ్ఱట్ట లూగెనూ
మిత్తెక్కి చూచెనూ ।

మిసమిసని మింటికై పొంగెనూ
మసక మసకల కళ్లు విప్పెనూ
ఎంత దూరా నుందో ఈ చిన్న పదుచంచు
సంతోసమే మేను సకలమ్ముగా మారి

మిరిమిర్రి చూచెనూ
బొటవ్రేళ్ళ ఎంచెనూ ।

ఏ నాటి ముసలి యీ కదలి
ఏ నాటి పెద్ద యీ కదలి
తిరిగి నలుగురిలోన తిరుగనేర్చినవాడు
పరగ కామమునకై బదరి పోయె నటన్న

తన కేమి పరువూ
కదలి రాజునకూ ?

"ప్రసిద్ధమైన అన్య భాషా కావ్యాలకు వచ్చిన తెలుగు అనువాదాలలో ముఖ్యంగా చదువదగింది 'పానశాల' అనే పేరుతో దువ్వూరి రామిరెడ్డి తెనిగించిన 'ఉమార్ ఖయ్యాం' రుబాయతులు. తెనుగులో స్వతంత్ర కావ్యం అనిపించేటంత సహజంగానూ, మధురం గానూ ఆయన దాన్ని తెలుగు చేశారు. చదువ దగిన మరో అనువాద కావ్యం రాయప్రోలు వ్రాసిన 'దూత మత్తేభం'. ఇది సంస్కృతంలో కాళిదాసు వ్రాసిన మేఘ సందేశానికి తెలుగు సేత ।

"ప్రాచీన కవిత్వం సంఘ ధర్మానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వగా, ఆధునిక భావ కవిత్వం వ్యక్తిగతమైన



దువ్వూరి రామిరెడ్డి *(1897 - 1947)*

అనుభూతులకూ, వ్యక్తి స్వేచ్ఛకూ విశేష ప్రాముఖ్యం ఇచ్చింది. కృష్ణశాస్త్రి వ్రాసిన 'నా ఇచ్ఛయే గాక నా కేటి వెరపు?' వంటి స్వేచ్ఛా గీతాలను ప్రజలు ఆదరింపసాగారు.

"భావ కవిత్వంలో రాధాకృష్ణుల ప్రణయ వర్ణన కూడా కనిపిస్తుంది. కృష్ణశాస్త్రి వ్రాసిన 'అన్వేషణ' (వైతాళికులు) అనే ఖండకావ్యం చాలా ప్రశస్తి పొందింది. భావ కవిత్వ యుగంలో గుర్రం జాషువా కవి అందరికీ అర్థం అయ్యే చక్కని ఖండ కావ్యాలు వ్రాసి ప్రజాదరణ చూరగొన్నారు. ఈయన వ్రాసిన 'సాలీడు', 'శ్మశానం', 'గబ్బిలం', 'తాజ్ మహల్' వంటి ఖండ కావ్యాలు పలు ముద్రణలు పొందాయి.

"1940 ప్రాంతం నుంచీ తెలుగు కవిత్వంలో వచ్చిన రెండు ప్రధాన ఉద్యమాలలో ఒకటి: అభ్యుదయ కవితోద్యమం. ఈ ఉద్యమం ప్రవక్త శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ). తెలుగు కవిత్వంలో ఇతివృత్తంలోనూ, ఛందస్సులలోనూ, అలంకార విన్యాసంలోనూ కూడా మూలముట్టుగా మార్పు తేవాలని యత్నించిన మహోద్యమం ఇది. శ్రీశ్రీతో సహా అభ్యుదయ కవు లందరూ కార్ల్ మార్క్స్ ప్రవచించిన సామ్యవాద సిద్ధాంతం చేత ప్రభావితులై నవ్లాళ్లే కవిత్వం సంఘ వాస్తవికతను ప్రతిబింబించా లనీ, సంఘాన్ని మార్చే సాధనం కావా లనీ వీరి తపన.

'కదిలేదీ, కదిలించేదీ
మారేదీ, మార్పించేదీ



గుర్రం జాషువా (1895 - 1971)

పెను నిద్దుర వదలించేదీ
పరిపూర్ణపు బ్రతు కిచ్చేదీ'

కవిత్వం అంటాడు శ్రీశ్రీ.

'ఛందో బందోబస్తు లన్నీ
ఛట్ ఫట్ ఫట్ మని త్రెంచి
అర్థాన్ని అధ్వాన్నపు టడవిలో వదలి
పద్యాన్ని గద్యానికి పెళ్లిచేద్దాం!'

అని సరదాగా తన అనుయాయులకు సలహా ఇచ్చినా, తాను మాత్రం ఛందస్సులను విడిచి పెట్టక పోవడమే కాదు; వివిధ మాత్రా చ్ఛందస్సుల మీద అధికారం సాధించి తెలుగు కవితా సరస్వతికి వింత వింత విలాసపు నడకలు నేర్పిన మహాకవి శ్రీశ్రీ!

"ఇదిగో - ఈ గీతం ఎంత భావానుగుణంగా నడుస్తుందో, ఏ కాలంలో అయినా గొప్ప కవిత్వంగా ఎలా పరిగణింప దగి ఉందో వినండి:

గగన మంతా నిండి
పొగ లాగు క్రమ్మిక
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను!

ఆకాసపు ఎడారి
అంతటా అకట!
ఈ రేయి రేగింది
ఇసుక తుపాను!

గాలిలో కనరాని
గదుసు దయ్యాలు
భూ దివమ్ముల మధ్య
ఈదుతున్నాయి!

నోరెత్తి హోరెత్తి
నోగులు సాగరము!
కరి కళేబరము లా
కదలదు కొండ!

ఆకాశపు ఎడారి
లో కాళ్లు తెగిన
ఒంటరి ఒంటెలా
గుంది జాబిల్లి!

విశ్వ మంతా ఒండి
వెలి బూది వోలె,
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను!

"అభ్యుదయ కవిత్వంతో పాటు శ్రీశ్రీ ప్రథమ ప్రపంచ సంగ్రామం (1914-1918) అనంతరం యూరప్‌లో తల ఎత్తిన డాడాయిజమ్, ఇమేజిజమ్, సర్రియలిజమ్ వంటి అరాజకపు కవితా ప్రకియలను కూడా తెలుగులో ప్రవేశ పెట్టాడు.

న - న - న - న - నత్తి మాటలు కూడా
మ - మ - మ - మ - మన కవిత్వంలో ఉండొచ్చు!

అంటూ ఎన్నో టుప్రీలు ఆయన వ్రాశాడు.

"తెలుగులో కొన్ని వచన పద్యాలు కూడా వ్రాపి
వచన కవితా శాఖకు కూడా శ్రీశ్రీయే ఒరవడి పెట్టినా, నిజా



శ్రీ శ్రీ (1910 - 1983)

నికి తెలుగులో వచన కవిత్వానికి పితామహుడు అని చెప్ప దగ్గవాడు పఠాభి. ఆయన తన 'ఫిడేల్ రాగాల డజన్'లో-

నా యీ వచన పద్యా లనే దుడ్డు కఱ్ఱల తోటిన్
పద్యాల నడుముల్ విరుగ దంతాను
చిన్నయ్ సూరి బాల వ్యాకరణాన్ని
చాల దండిస్తాను.

ఇంగ్లీషు భాషా భాండారంలో నుండి
బందిపోటుం జేసి కావల్సిన
మాటల్ని దోస్తాను.
నా యిష్టం వచ్చినట్లు జేస్తాను
అనుసరిస్తాను నవీన పంథా, కానీ

భావ కవిన్ మాత్రము కాన్నే, నే
నహంభావ కవిని!

అంటూ కవితా రంగ ప్రవేశం చేశాడు.

అభ్యుదయ కవులలో ఆరుద్ర, కాళోజీ, దాశరథి వంటివారు ముఖ్యంగా పేర్కొనదగ్గవారు. అయితే శ్రీశ్రీ తరువాతి అభ్యుదయ కవులలో శ్రీశ్రీలో లాగ కవిత్వపు విలువల పాలు కాకుండా అభ్యుదయపు పాలు హెచ్చు కావడంతో అవి ఎక్కువగా ప్రజలలోకి పోలేదు. అభ్యుదయ కవిత్వం ఎంతగా విజృంభించినా, మరో పక్క రొమాంటిక్ ఉద్యమం, ప్రాచీన సాంప్రదాయిక కవిత ఆ తరువాత కూడా కొనసాగుతూనే వచ్చాయి. సి. నారాయణరెడ్డి, దేవరకొండ

బాలగంగాధర తిలక్ ఎలాంటి ఛందస్సులు వాడినా వాళ్లలో రొమాంటిక్ ఛాయలే ఎక్కువగా కనిపిస్తాయి. సాంప్రదాయిక ఛందస్సులలోనే వ్రాస్తూ అందరికీ అర్థమయి ఆనందం కలిగించేట్టు కవిత్వం చెప్పి ప్రజల మన్ననలను పొందిన ఇద్దరు కవులు: మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి, జంధ్యాల పాపయ్యశాస్త్రి. ఆధునిక కవులలోని ప్రముఖుల నందరిని ఒక చక్కని సీస పద్యంలో జంధ్యాల పాపయ్యశాస్త్రి ఇలా స్మరిస్తాడు :

జడయల్లి జడకుచ్చు లిడ 'రాయప్రోలు', శ
 ల్లావఝ్ఝల 'కిరీట లక్ష్మి' నింప
'పింగళి', 'కాటూరి' ముంగురుల్ సవరింప
 'దేవులపల్లి' శ్రీ తిలక ముంప
'విశ్వనాథ' వినూత్న విధుల కిన్నెర మీట
 'తుమ్మల' రాష్ట్రగాన మ్మొనర్ప
'వేదుల', 'నాయని' వింజామరలు వీవ
 'బసవరాజు', 'కొడాలి' పదము లొత్త
'అడవి', 'నండూరి' భరత నాట్యములు సలుప
'జాషువా', 'ఏటుకూరి' హెచ్చరిక లిడగ
నవ్య సాహిత్య సింహాసనమున నీవు
ఆంధ్ర కవితా కుమారి! 'దీర్ఘాయు రస్తు!'

"వచన కవితా శాఖకు బాగా పుష్టి చేకూర్చిన ఇద్దరు కవులు: కుందుర్తి ఆంజనేయులు, బాలగంగాధర తిలక్. వీరిలో బాలగంగాధర తిలక్ తన 'అమృతం కురిసిన రాత్రి' లో వచనాన్ని నిజంగా కవిత్వం చేశాడు. ఈ నాడు 'వచన

కవిత' పేరుతో వస్తున్న రచనలు వచనమే కాని కవిత్వం కాదని కొందరు విమర్శకులు అంటున్నారు."

"బాలగంగాధర తిలక్ తన 'అమృతం కురిసిన రాత్రి' లో 'నా కవిత్వం' అనే తొలి పద్యంలో తన కవిత్వ లక్ష్యాలను ఎలా వివరించాడో వినండి :

నా కవిత్వం కాదొక తత్త్వం
మరి కాదు మీ రనే మన స్తత్వం
కాదు ధనికవాదం, సామ్యవాదం
కాదయ్యా అయోమయం, జరామయం !

గాజు కెరటాల వెన్నెల సముద్రాలూ
జాజి పువ్వుల అత్తరు దీపాలూ
మంత్ర లోకపు మణి స్తంభాలూ
నా కవితా చందనశాలా సుందర చిత్ర విచిత్రాలు !

అగాధ బాధా పాథః పతంగాలూ
ధర్మవీరుల కృత్త రక్త నాళాలూ
త్యాగశక్తి, ప్రేమరక్తి, శాంతిసూక్తి
నా కళా కరవాల ధగద్ధగ రవాలు !

నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయా పారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు!

ప్రొద్దు క్రుంకవస్తూంది. మళ్ళీ ఆకాశంలో మబ్బులు కమ్ముకోసాగాయి. కోటయ్య తొందర చేయడం మొదలు పెట్టాడు.

"మరేం ఫర్వాలేదు. వర్షంరాదు, గ ర్ష ం రా దు. ముఖ్యంగా మాకు ఇటీవల తరచుగా వినిపిస్తున్న దిగంబర కవులను గురించి కూడా చెప్పు తాతయ్యా!" అంది అమల.

వాళ్ల ఉత్సాహానికి సంతోషపడుతూ దయానిధి ఇలా తన కథ కొనసాగించాడు :

"1940 తరువాత మన కవిత్వంలో వచ్చిన మొదటి ఉద్యమం అభ్యుదయ కవిత్వోద్యమం అన్నాను గదా! రెండోది: దిగంబర కవిత్వోద్యమం.

"కవులలో నిజాయితీ లోపించడం, పాశ్చాత్యాను కరణ, నటన ఎక్కువ కావడం చూసి ఆవేశపరులైన కొందరు యువ కవులు - నగ్నముని, నిఖిలేశ్వర్, చెరబండ రాజు, జ్వాలాముఖి, మహాస్వప్న లాంటి వారు- కలం పేరు లతో దిగంబర కవులుగా రంగ ప్రవేశం చేశారు. సంఘాన్ని గురించీ, జీవితాన్ని గురించీ తమకు కనిపించే నగ్న సత్యాన్ని నిర్భయంగా చాటుతాం అని వారి ప్రతిజ్ఞ. 'దిక్'లు అనబడే వచన పద్యాల సంపుటాలను మూడింటిని వీరు ప్రకటించారు. ఆ సంపుటాలను ఒక రిక్షావాలాచేత, ఒక పడుపు కత్తెచేత వారు ఆవిష్కరింపజేశారు.

"ఆదిలో యువ పాఠకులను వీరు ఎక్కువగా ఆక ర్షించ గలిగినా, క్రమంగా వీరు కూడా రాజకీయాలలోకి దిగి నక్సలైట్ ఉద్యమాన్ని సమర్థిస్తూ 'విప్లవ రచయితల సంఘం లో చేరడంతో వీరినీ అభ్యుదయ కవులను చూసినట్టే లోకం చూడ సాగింది.

"పురాణ కవిత్వం నుంచి విప్లవ కవిత్వం దాకా తెలుగు కవిత్వం ఎన్నెన్ని మలుపులు తిరుగుతూ వచ్చిందీ చూచాయగా మాకు అర్థం అయేట్టు చెప్పావు తాతయ్యా! నీకు చాలా థాంక్స్! నేను ఎక్కడో 'బంధ కవిత్వం' అనే మాట విన్నాను. దాన్ని గురించి కూడా రెండు ముక్కలు చెప్పు తాతయ్యా!" అని అడిగింది అమల.

"నీ జిజ్ఞాస నాకు ముచ్చట వేస్తూంది తల్లీ! తెలుగు పిల్లలందరికీ మన తెలుగు కవిత్వాన్ని గురించి వివరంగా తెలుసుకోవాలని ఇంతటి జిజ్ఞాస ఉంటే ఎంత బాగుండును!

"ఆశు కవిత్వంలాగ, అవధాన కవిత్వంలాగ బంధ కవిత్వం కూడా నిజానికి కవిత్వం కాదమ్మా! అది కేవలం మేధాశక్తి తాలూకు బల ప్రదర్శన మాత్రమే! ఇటీవల ఆధునిక కవి ఆరుద్రకు షష్టిపూర్తి జరిగినపుడు ప్రచురించిన సంచికలో ఆరుద్ర గురువు రావూరి దొరసామి శర్మ 'శుభాశాసనము' అని అతని మీద పద్యాలు వ్రాస్తూ చిట్టచివరి గీత పద్యం 'రథ బంధం'గా కూర్చాడు:

ఆ పద్యం చూడండి :

ఆఢ్య రుద్ద్రి యశో ప్రధీమాత్త్వశోభ
కుశల ధీమత్త ఘూర్ణవికుంఠ దీప్తి
విస్ఫురత్తేజ మాయురాప్తి గణనీయ
శక్తి సత్ ప్రౌఢిమ శ్రీ యొసంగు గాత!

“దీనిని రథం ఆకారంలో అడ్డంగా 1,3,5,7,9,9,7,5, 3,1 గళ్లు ఉండేట్టు ఒక చిత్రం గీసి, పైనుంచి ఒక్కొక్క



రథ బంధం

గడిలో ఒక్కొక్క అక్షరం చొప్పున వ్రాసుకుంటూ వస్తే మధ్య ఉన్న నిలువు గళ్లు పదింటిలో 'ఆరుద్రకు విజయ మగుత' అనే అక్షరాలు వస్తాయి."

"ఆధునిక తెలుగు కవిత్వం కథ పూర్తి చేసే ముందు మరో రెండు అంశాలు మీకు చెప్పాలి. తెలుగు కవిత్వాన్ని ప్రోత్సహించే దృష్టితో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక సాహిత్య అకాడమీని స్థాపించింది. ఇటీవలి వరకూ ఆ అకాడమీ చాలా చురుకుగా పని చేస్తూ వచ్చింది. ప్రస్తుతం తెలుగు కళల సర్వతోముఖ వికాసానికి కంకణం కట్టుకున్న తెలుగు విశ్వవిద్యాలయంలో అది విలీనం చేయబడింది.

"కారణాలు ఏవైనా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తెలుగు కవిత్వం అంతకు ముందున్న ప్రజాదరణను కోల్పోయినట్టు కనిపిస్తూంది. నవలలకూ, కథలకూ ఉన్నంత గిరాకీ ఈనాడు కవిత్వానికి లేదు. బహుశః ఇందుకు ఒక కారణం:మన మంచి కవు లందరూ సినిమా రంగంమీద ఎక్కువ మోజు చూపించడం కావచ్చు. మరొకటి - కవిత్వం ఉదాత్తమైన రసానందాన్ని కలిగించే తన ప్రధాన కర్తవ్యానికి స్వస్తి చెప్పి, రాజకీయాలకూ, సంఘ సంస్కరణోద్యమాలకూ కేవలం ఒక పరిచారికగా మారిపోవడం కావచ్చు।

"చివరి మాట-మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాష్ట్ర ప్రభుత్వాలు ఆస్థాన కవులను నియమించే ఆచారాన్ని చేబట్టాయి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మొట్టమొదటి తెలుగు ఆస్థాన కవిగా తిరుపతి వేంకట కవులలో ఒకరైన

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు నియమింపబడ్డారు. ఆ తరువాత ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డ అనంతరం వరుసగా కాశీ కృష్ణాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, దాశరథి తెలుగు ప్రభుత్వపు ఆస్థాన కవు లయారు. ప్రస్తుతం ఆ ఆస్థానకవి పదవి అమలులో లేదు.

"శ్రీశ్రీ తరం వరకూ అంతకు ముందు తరంలో మహాకవులుగా ప్రజల ఆదరం పొందినవారు తమ తరువాతి తరంలోని ప్రతిభావంతులైన కవులను గుర్తించి వారిని ప్రజల దృష్టిలోకి తీసుకువచ్చే సత్ సంప్రదాయం మన దేశంలో ఉండేది. శ్రీశ్రీ కొత్తగా కవిత్వం వ్రాసే రోజులలో బెజవాడలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్ సభలో 'కవితా! ఓ కవితా!' అనే గేయం ఆయన చదివాడు. ఆ సభకు అధ్యక్షత వహించిన విశ్వనాథ సత్యనారాయణ ఆ గేయానికి ముగ్ధుడై 'మనకొక మహాకవి అవతరించాడు' అని శ్రీశ్రీని కీర్తించి ఆయనపైకి రావడానికి తోడ్పడ్డాడు. ఆ తరువాత ఆ సంప్రదాయం అంతరించి యువకవులలో ప్రతిభావంతులైన వారెందరో తగిన గుర్తింపులేక అలమటించి పోతున్నారు. స్వాతంత్ర్యోత్తర కాలంలో మంచి కవిత్వాన్ని ప్రకటించే పత్రికలు కరువయాయి. ఎవరు ఎక్కువ పలుకుబడి సంపాదిస్తే, ఎవరు ఎక్కువగా ప్రచార సాధనాలను ఉపయోగించుకోగలిగితే వారు మహాకవు లయ్యే పరిస్థితి ఏర్పడింది. కవిత్వంలో మంచి చెడ్డల విమర్శ అడుగంటింది. తెలుగు కవిత్వానికి నేడు ప్రజాదరణ

తగ్గడానికి ఈ పరిస్థితి కూడా కొంతవరకు కారణం అన వచ్చు।

"ఇంక ఒక్కమాట చెప్పి మన కథ ముగిస్తాను. నన్నయ దగ్గర నుంచి నగ్నముని దాకా మన తెలుగు కవిత్వం ఎన్నెన్నో అవతారాలు దాల్చింది. అయితే ఇతర భాషలలోకి అనువదించబడి మన తెలుగు కవిత్వానికి విశ్వ విఖ్యాతి తీసుకొని రాగల మహాకవులు మనలో ఎక్కువగా కని పించరు. భవిష్యత్తులో తెలుగు కవిత్వానికి మరింత ఉజ్జ్వల మైన రూపం కల్పించి జగత్తు అంతటి దృష్టినీ ఆకర్షించే బాధ్యత మీ యువతరం మీద ఉంది. మరి మీ తరం మన తెలుగు కవిత్వాన్ని ఎలాంటి మలుపు తిప్పుతుందో చూడాలి!" అంటూ దయానిధి 'తెలుగు కవిత' కథ ముగించాడు.

తాము విన్న కథ మననం చేసుకుంటూ రెండు నిమి షాల పాటు పిల్లలంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. అంతలో కోటయ్య బండి కట్టుకు రావడంతో ఎవరి ఆలోచనలతో వారు ఉక్కిరి బిక్కిరి అవుతూ మౌనంగానే బండీ ఎక్కారు. వాళ్ళ ఆలోచనలకు భంగం కలిగించడం ఇష్టం లేని దయా నిధి కూడా ఇంటికి వెళ్ళే దాకా వారిని మరి పలుకరించలేదు.